## Bibliographic Record Target

జపానుదేశసాంఘికచరిత్ర / ఇది ఆంగ్లేయభాషాగ్రంథమునుండి నండూరిమూర్తిరాజు గారిచే నాంధ్రీకరింపఁబడినది.- 1. కూర్పు.- తణుకు : డి. వి. రమణారావు, 1910.

(1), iv, 118 p. ;17 cm.

Record no. 257

Japānudēśasāṅghikacaritra / idi āṃglēyabhāṣāgranthamunuṇḍi Naṇḍūrimūrtirāju gāricē Nāndhrīkarimpam̐baḍinadi.- 1. kūrpu.- Taṇuku : Ḍi. Vi. Ramaṇārāvu, 1910.

(1), iv, 118 p. ;17 cm.

Record no. 257

# జపానుదేశసాంఘికచరిత్ర



ఇది

ఆంగ్లేయభాషాగ్రంథమునుండి

## నందూరిమూర్తిరాజు బి.యే గారిచే

సంగ్రహీకరింపబడి



మొదటికూర్పు 1000 ప్రతులు.



## డి. వి. రమణారావుగారిచే

తణుకు.

శ్రీసౌదామిని ముద్రాక్షరశాలలో

ముద్రింపబడినది.

1910.

---

 వెల రు0—8—0 



To

His Majesty Edward VII Emperor of India This book is respectfully dedicated by his mos obedient Subject.

N. Murtiraju.

# పీఠిక.

ఏదేశంబును మున్ముందుఁ జూడక యనుదినంబు లోకనే త్రుండన్యదేశంబులఁ జూడనొల్లఁడో, యేదేశంబు పూర్వఖండమునకు శిరోభూషణంబై తనకీర్తిభానుని లోకమంతటఁ బ్రకాశింపఁజేయుచున్నదో, యేదేశంపు పరాక్రమతేజశ్శౌర్యంబులు ప్రాగ్దేశంబుల జనులహృదయంబులం దాశాలత లంకురింపఁజేసిన దోహదంబులయినవో యేదేశంబుఁ దాఁకఁ దలంచి వైరివిషయంబు లబ్బురంబుదోఁప గుండెనిబ్బరము జెడినవో యట్టిజపానుదేశనామము శిశుబాలవృద్ధులందఱి జిహ్వాగ్రములను నిరంతరము నాట్యము చేయుచున్నది. మొన్న మొన్న రష్యాయుద్ధమునకుఁ బూర్వమీపేరు భూగోళశాస్త్రమునం దక్క మఱెక్కడను వినరాదు. చిన్నదేశమయ్యు నిది తనకంటె ననేకమడుగులు విస్తీర్ణము చేతను, భాగ్యము చేతను, బలంబుల చేతను బెద్దదియగు [illegible] దేశంబగు రష్యాను బారఁదోలుటయే దీనిఖ్యాతి లోకమంత వ్యాప్తమగుటకుఁ గారణము.

దీనికిట్టిపేరుకలిగి జనులకు దానియందు గౌరవము ప్రబలినతోడనే దానింగూర్చినగ్రంథములనేకములు (హూణభాషలో) వెలువడినవి. ప్రతిసభయందును దానిగుణంబులు ప్రశంసనీయము లయినయవి. ప్రతియుపన్యాసకులును దాని[illegible]ముగాఁ బేర్కొనుచువచ్చిరి. అభివృద్ధినిగూర్చి యెవ్వరు ముచ్చటిం

చుకొన్నను దానింబార్కాణముగఁ జేర్కొనుచుండిరి. షాపులయందు జపానువస్తువులకు గౌరవము హెచ్చినది. పెక్కుమంది విద్య నేర్చుటకు జపానునకుఁ బోవ నారంభించిరి. ఇట్లు జపానుదేశము లోకమందఱికిఁ దెలిసినదేశ మయినది.

కాని, యా దేశముయొక్క సాంఘికస్థితి ఆచారములు సంసారపుకట్టుబాటు ఆదేశీయులమతభక్తి రాజభక్తి పితృభక్తి దేశభక్తి వారిబాలశిక్ష వారియాటపాటలు, ఉత్సవములు, పండుగలు భోజనాదికములు స్త్రీలస్థితి మున్నగువిషయములు హూణభాష నెఱుంగనియాంధ్రులకుఁ గగతలామలకములుగఁ దెలియుట కవకాశము కలుగలేదు. ఉన్నగ్రంథములు హూణభాషలోనున్నవి. కాని యాంధ్రభాషయందుఁ గానరావు.

విద్య నేర్చుకొనుట కా దేశమేగివచ్చినవారు పైవిషయములను దెలియఁజేయుపుస్తకములను రచియించిన దేశోపకారులగుదురు గాని, వారట్టియుద్యమమే కారణముచేతనో గాని పూనుకొనరైరి. తాము స్వయముగ నేగియాదేశపుపద్ధతులఁ బరిశీలించివచ్చిన మనవారు వ్రాసినగ్రంథములు విదేశీయులు వ్రాసిన గ్రంథముల భాషాంతరీకరణములకంటె మిక్కిలి యెక్కువయుపయోగములుగ నుండుననుట వాస్తవమే. కాని యట్టివి లేనప్పుడు భాషాంతరీకరణములతోడనే తృప్తినొందవలసివచ్చును. ఈభాషాంతరీకరణములయినను శాస్త్రాదులందలిసరియైనభావ



ములు, మఱియొకభాషలోనికి సుకరముగఁ దేఁజాలవుగాని చారిత్రాదికముల నొకభాషనుండి మఱియొకభాషకు సుకరముగనే జేయవచ్చుననుకొనియెద. దేశాటనము సేయుట, చేసి యచ్చటియాచారవ్యవహారములను సవిమర్శముగాఁ బరిశీలించుట యాపైని గ్రంథము వ్రాసి యితరులకుఁ దాముగ్రహించినవిషయములను సాకల్యముగ బోధపఱచుట యనునవి మనదేశస్థులకింకను బాగుగఁబట్టుపడలేదు. ఐరోపాదేశీయుఁ డెవ్వఁడైన నొకచిన్నపల్లెటూరికిఁ బోయివచ్చినా దానింగూర్చి యొకపెద్దగ్రంథము వ్రాయును. మనవార లెన్నిమాఱులు కాశీయాత్రలు చేసివచ్చినను సరే విశ్వేశ్వరాలయములోజరుగు నొకయుత్సవమునైనఁ దిన్నగ వర్ణింపనేరరు. దీనికిఁగారణ మభ్యాసము లేకుండుటయే గాని శక్తిలేకపోవుట కాదు.

జపానుదేశముంగూర్చి యీయంశముల నాలోనేనొకమారుదలపోసికొనుచుండగ, "Peeps at many lands, Japan by John Finnemore" అనుగ్రంథము 1909సంవత్సరమున ప్రవేశపరీక్షకు బఠనీయగ్రంథమయి నాతమ్మునిచేత నుండఁగాంచి దానిం జదివి చూచితిని. జపానుయొక్కసాంఘికచరిత్ర దానిలోఁ గొంతవిపులముగ వర్ణింపఁబడినట్లు నాకుఁ దోఁచుటయే గాక యా దేశపుటాచారములకును మనయాచారములకును జాలవిషయములందుఁ బోలిక గనిపించుటచే దాని నాంధ్రీకరించు

దమును నభిలాష తోడనే పోడమినది. కాని వెంటనే యూవని నెఱవేర్చుటకు సేవావృత్తి నున్నవాడ నగుటయేగాక యొక్కచోట స్థిరముగ నుండక యూరూరం బనిగలిగి సంచారము చేయవలసిన రైవిన్యాసపరీక్షకుఁడనుగ నియమింపఁబడుటగూడ నప్పుడ తటస్థమగుటం జేసి నామనోరథము శీఘ్రముగ సిద్ధింపదయ్యె. ప్రస్తుతము నాకుఁ గొంతయవకాశము కలిగినందున సంవత్సరమునుండి నామదినున్న యీాప్సితము నెఱవేర్చుకొనఁగలిగితిని.

[ఇట్టిగుర్తులనడుమనున్న వాక్యములు నాయభిప్రాయములను దెలుపునవిగాని భాషాంతరీకరణములుగాదని విన్నవించుకొనుచున్నాఁడ.]

నండూరి మూర్తిరాజు,

20—6—10.





శ్రీరామలింగేశ్వరాయనమః.

# జపానుదేశసాంఘికచరిత్ర.



## మొదటిప్రకరణము.

### సూర్యుఁ డుదయించుచోటు.

ఆశియాఖండమునకుఁ బూర్వపూర్వమున మనకతిదూరమున జపానుదీవులు గలవు. 'జపాను' శబ్దమునకు సూర్యుఁ డుదయించుచోటని యర్థము. లోకమునకుఁ దూర్పుననుండి సూర్యుఁ డుదయించుప్రదేశమయి యుండుటంబట్టి దాని కానామ మెంతయుఁ దగియున్నది. [జపానుశబ్దమునకు 'స్వభాను' అను సంస్కృతశబ్దమును వాడిన బాగుగా నుండు నని నాయభిప్రాయము. కొందఱుపండితులతో నాలోచింపగా వాడవచ్చునని యనుమతించిరి.]

జపానుదేశస్థుల కేతనములపైనిఁ గూడసకలదిశలకుఁ దన తేజఃపుంజమును వ్యాపింపఁజేయుచేతసూర్యుఁడు లిఖింపఁబ

యుండును. మొన్న మొన్న రష్యాదేశస్థులతోఁ బోరి జపానీయులు గాంచిన ప్రసిద్ధవిజయమునాఁటినుండియు నీధ్వజము శాశ్వతమైన ప్రసిద్ధిని బడసియున్నది.

కొన్ని విషయములలో నీజపానులు తమమిత్రులు, చుట్టములు నగు నాంగ్లేయులతోఁ దమ్ముఁ బోల్చుకొనఁ గుతుకపడుచుందురు. బ్రిటను దేశ మైరోపాఖండమునకు సముద్రతీరమున నున్నకొన్ని ద్వీపముల సమూహమయి యున్నట్లు జపాను ఆశియాఖండమునకు సముద్రతీరమునఁ గొన్ని ద్వీపములసమూహమై యున్నది. జపానులును హూణులవలెనే నేలమీఁదను నీటిమీఁదనుగూడ నసమానమైన యుద్ధము లొనరించి యందు నిందునుగూడ ధీరులు శూరులు, నని పేరు వడసిరి. ఇట్టికారణములను బట్టి దేశమును ప్రాక్సముద్రమందలి బ్రిటననియుఁ దమ్ముఁ బ్రాచ్యాంగ్లేయు లనియు జపానులు పిలుచుకొన నభిలాషపడుచుందురు.

జపానుదేశము కడువింతగను అతిశీఘ్రముగను, లోకములోని గొప్పదేశములలో నొకటిగ వృద్ధిజెందినది. ఏఁబదియేండ్లకుముందు జపానుదేశ మెట్టిదో లోకమెఱుంగదు. వారితరులను దమదేశమునకు రానిచ్చెడువారు గారు. కాఁబట్టి జపానీయులనుగుఱించియు, వారియాచారాదులనుగుఱించియు నేమియుఁ దెలియకుండెను.



అప్పుడు వారినావికాబలము కొన్ని పడవలుమాత్ర ముండెను. నేఁడో యినుపయోడలుగలగొప్పదండును వానిని నడుప నాంగ్లేయులకుఁ దీసిపోనిచాతుర్యముగల నావికానాయకులను గలిగి శోభిల్లుచున్నది. మున్ను వారికాల్బలము రెండుకత్తులును విల్లమ్ములును దాల్చెడుకొన్ని పటాలములు మాత్రమే. ఇప్పుడు వారిబలములు లోకమున కద్భుతము గలిగించుచు నత్యంతనవీనములగు నాయుధములతో శోభిల్లుచు నెంతటిగొప్పదేశము వారును వారితో వైరమునిన నడలుపుట్టించుచున్నవి.

ఏఁబదియేండ్ల క్రిందటఁ జపాను సామంతరాజులపరిపాలనమున నున్నది. ఆదుఘనులను 'డైమియో', లని పిలిచెడువారు. అట్టిప్రతివానికి నొక్కొక్క కోటయుఁ గొంతసైన్యము నుండెడివి. వీరొకరితో నొక రెడతెగక కలహించుచు వారిసాముఱాయిలును వీరి 'సాముఱాయి'లును, నిత్యముఁబోరాడుచుండెడి వారు. 'సాముఱాయి', యనివారిసైన్యమునకుఁ బేరు. జపానా కాలమున 'రోజెస్', యుద్ధముల కాలమునందలి యాంగ్ల దేశమును బోలియుండెను. ఈకుటుంబకలహములు ప్రబలయుద్ధములయి పోరులు జరుగుచుండెను. అదియంతయు నిప్పుడు నశించినది. అప్పటిడైమియోలిప్పుడు తగుపెద్దమనుష్యులుగా నుండిరి. సాముఱాయిసైన్యములు నిర్మూలము లయినవి. ఇప్పుడు జపాను

ఐరోపాదేశములవలె న్యాయాధిపతులు ( Judges ) ఆరక్షక
భటులు (Police) న్యాయస్థానములు(Law Courts) గలిగి పా
శ్చాత్యపద్ధతులమీఁదఁ బరిపాలింపఁబడుచున్నది. జపానీయులు
తక్కినదేశములలోఁ దమదేశముయొక్క ఘనతను స్థాపించుటకు
ముందునకు వచ్చినప్పుడు సాధారణప్రయత్నములను జేసియుండ
లేదు. చేఁబట్టినకార్యమును సాధించి తీరవలెనను దృఢమయిన
నిశ్చయముతో బయలువెడలి యొక్కమారన్నింట ఘనులయిరి.
నవీనోద్యమములయందును శోధనలయందును బూనికకలిగి ప్రవే
శించిరి. ఇనుపదారులను విద్యుత్తంత్రులను నెలకొల్పిరి. బ్యాం
కులు(నిధులు) వేర్ హౌసులు (సరకుకొట్లు) మిల్లులు (తిరుగలి
యంత్రములు) ఫ్యాక్టరీలు (కర్మశాలలు) వినిర్మించిరి. వంతెనల
ను గట్టి ఘంటాపథంబులను వృద్ధిచేసిరి. న్యాయస్థానములను
ప్రజాపరిపాలనసంఘములను నేర్పఱచుకొనిరి. ప్రజాపరిపాలన
సంఘమునకు సభ్యులను ప్రజలే యెన్నుకొనుచుండిరి. ఎచ్చటఁ
జూచినను వార్తాపత్రికలు వర్ధిల్లుచున్నవి.

జపాను మిగుల రమణీయమయినదేశము. అందుఁగల చ
క్కనిపర్వతములనుండి యిర్వాంకల నదులు ప్రవహించుచు నను
మానముగ నెత్తైనగుట్టలనుండి జలపతనములుగాఁ (Water falls)
బడుచుండును. ఆపర్వతములక్రింద ఫలవంతములయినసమప్రదేశ



ములును లోయలును గలవు. వానికొండలనుండి ప్రవహిం
చునదులు నీటివసతిం గలిగించుచుండును. కాని పర్వతము లె
క్కువగాను సమప్రదేశము తక్కువగాను నుండుటచేతఁ గొలఁది
భూమిమాత్రమే వ్యవసాయయోగ్యమయి జపానువకుఁ బేదరి
కముఁ దెచ్చుచున్నది. అందలిశీతోష్ణస్థితియును ఆంగ్లేయదేశ
పుస్థితినిఁ బోలియుండును. కాని యందలివేసవి యుష్ణతరము
గాను, శీతము కొన్నితావుల శైత్యతరముగాను నుండును.
అందలిపర్వతములలో నగ్నిపర్వతములు మెండుగా నుండును.
వానిలోఁ గొన్ని యిప్పటికిని బగులుచుండును. అందుచేఁ దరు
చు భూకంపములు పుట్టుచుండును. ఒక్కొక్కప్పుడీభూకంప
మునలన మిక్కుటమయిన హానిగలుగుచుండును. 1871సంవత్స
రమునఁ గలిగినభూకంపమునకు 10000జనులు మడసిరి. 20000
మందికిఁ గాయములు తగిలినవి. 130000యిండ్లు నశించినవి.

జపానునందలి యత్యున్నతమగు నపర్వత మతిరమణీయ
మయినదిగ గూడ నుండును. దానియందు జపానీయులకు మి
క్కిలి ప్రేమ. వారు దానిని బుణ్యనగముగా భావింతురు. దా
నిపేరు ఫూజిసాన్ (Fujisan) లేక ఫూజియామా. అది సము
ద్రమునకును, రాజధానిపట్టణమగు టోకియోనకును సమీపమున
నున్నది. దానియాకారము మిక్కిలిచక్కని కోనువలె నుండి.

13000 అడుగులపొడవున నాకాశమును నొరయుచుండు. సము
ద్రమువిూఁదనుండి చూచువారికి మనోజ్ఞముగఁ గనిపించుచుం
డును. తీరముకంటెను నగరముకంటెను ముఖ్యముగ తళతళ
మెఱయుచున్నచుకొఁ జుట్టుప్రక్కల నేమియు లేక, దాని మొదలె
చ్చటనో తెలియక, పొడుగైన దానిశిఖరముమాత్రము ప్రయా
ణికునికి సముద్రమువిూఁదికిఁ గానవచ్చును. జాపానులు ప్రకృతి
సౌందర్యమందతిప్రేమ గలిగినవారగుట, వారు ఫూజియామను
బూజింతురు. అచ్చటిచిత్రకారులు విసుగులేక సదా దానిఁ జి
త్రించుచుందురు. దానిచిత్రపటములు దేశదేశములందుఁగూడ
వ్యాపించియున్నవి.

---

## రెండవ ప్రకరణము.



### బాలుర—బాలికలు.

బాల్యము జపానునం దున్నంతసుఖకరముగ నేదేశ
మందును నుండదు. తల్లిదండ్రులు వారియందత్యాసక్తితోఁ బెం
చుదురు. అందుచేత వారు మిక్కిలి మంచివా రగుచున్నారు.



ఇది యతిశయోక్తిగాఁ గాన్పించినను కేవలము వాస్తవముగాని
స్వప్నము కాదు. ఈజపానుదేశమందలిబాలురును బాలికలును
పెద్దవారివలె నెమ్మదియును, శాంతమును, గలిగి వర్తింతురు.
తెలిసికొనుశక్తి యుదయించినతోడనే వారి కుల్లాసవిషాదముల
నడచిపెట్టుకొనుట యభ్యాసము చేయఁబడును. వారికిఁ బాధ
కలిగి దుఃఖపడునప్పుడుసయితము వారేడ్చుటగాని ముఖవికార
మున దానిఁజూపుటగాని జరుగదు. మఱియు నిట్లే వారు సంతో
షముతో నున్నప్పుడు దానినిఁ బకపకనవ్వుటవలనఁగాని యఱచు
పడివలనఁగాని వెల్లడిచేయరు. అట్లు చేసిన నది మోటుగా నెంచఁ
బడును. ఇట్టికట్టుబాటులలో మెలఁగుటవలన జపానుబాలికలును
బాలురును, మిగుల నెమ్మది, శాంతము, గౌరవము, మర్యాద,
విధేయత, మొదలగుసద్గుణములు గలిగి యెల్లప్పుడును బ్రతివా
రియెడలను గౌరవము జూపుచుఁ జిఱునగవు మొగములఁ దోలు
కాడ నందఱకు ముచ్చటఁ గూర్చుచుందురు.

బాల్యమున బడికిఁ బోకుండనుండుకాల మంతయు వా
రు విచ్చలవిడిగా నాటలాడుచు శైశవక్రీడలం దేలుచుందురు.
పల్లెలయందును బట్టణములయందునుగూడ వీథులే వారికాట
చోటులు. వారావీథులలో, బంతులాటలు, గాలిపడగలు,
బొంగరములులోనగునాట లాడుచుందురు.

ప్రతిబాలికయుఁ దనతోఁబుట్టువగుపిల్లవానినో పిల్లనో తనవీపునఁ గట్టుకొని యుండును. ఎక్కడనో భాగ్యవంతులదా దులుతప్ప పిల్లలను జంకనెత్తుకొనువాడుక జపానునందు లేదు. పసిబిడ్డను తల్లిగాని యక్కగాని యొక శాలువతోఁ దనమూపునఁ గట్టుకొనును. అదియే యాపసిబిడ్డకు మంచముగను నుయ్యేలగను గూడ వినియోగించును. ఇట్లు వీపునఁ బిడ్డయున్నప్పటికి నా బాలిక కది యాడుకొనుటకు లేశము నాటంకమును గలిగింపదు. అది యిటునటుఁ బరుగులెత్తుచు, స్నేహితులను దరుముచు ఖేలనము గావించుచుండ మూపుననున్నపసికూన ప్రక్కల కూగులాడుచు దొర్లిపడునో యనునట్లుండును. గాని యదియేమియు బాధనొందక తృప్తికలిగి తనచల్లనిచిన్నకన్నులఁ దెరచి యాటలనుజూచుచుండును. లేదా చూచిచూచి చల్లగ నిద్రవోవును.

దుస్తులను ధరించుటయందు బాలురను బాలికలు నొక్కరీతి నుందురు. అంతియగాక వారు సొగఁదమతల్లిదండ్రులవలె దుస్తుల ధరింతురు. జపానునందుఁ బిల్లలకు వేరురకముదుస్తు లేదు. పెద్దవారు ధరించురకముదుస్తులే పిన్నవారికై చిన్నవిగాఁ జేయఁబడును.

వారిదుస్తులలోఁ బ్రధానమైనది 'కిమోనో', యనఁబడు నొక వదులైన యంగీని "ఓబీ" యనఁబడు



నొకదట్టీతో శరీరమునకుఁ గట్టుకొందురు. ఓబీని ధరించుట జపానుబాలిక కెంతో సంతోషము. భాగ్యవంతులపిల్లలయోబీలు విలువగలపట్టుతోడను, సరిగతోడను నేయఁబడును. పేదలు దానిని తమస్థితికిఁ దగినంతవిలువగలదానిగఁ జేసికొందురు. దుస్తులతరువాత బాలికలకుఁ దమతలలయందు ధరించునగలు ప్రేమాస్పదములు. వారినల్లనికురులపై పవడము, కూర్మకర్పరము (Tortise shell) లోనగువానితో నమర్పబడిన సూదులు (Hair pins) దువ్వెనలు మొదలగుచక్కని జిలుగుచెక్కఁబడినయాభరణములను వారు పెట్టుకొందురు.

బాలురయోబీ పనికుపయోగించునదియై బాలికలదానివలె నంతవిలువగలిగినదియై యుండదు. మిక్కిలిచిన్నతనమున బాలురదుస్తులు పసుపుపచ్చగాను, బాలికలదుస్తులు యెఱ్ఱగాను నుండును. అయిదేండ్లువచ్చినతరువాత బాలుఁడు "హాకామా" యనుదుస్తును ధరించి మురియుచుండును "హాకామా" యనునది యొకరీతి పట్టుషరాయి. దానిని లోపలియంగీకి మాఱుగాఁ బురుషులు ధరియింతురు. అయిదేండ్లు వచ్చినతరువాతఁ బ్రతిబాలుని నంతవఱకుఁ దన్నుఁగాపాడినదయామయుఁడైనయీశ్వరుని యాలయమునకుఁ గొనిపోయి మ్రొక్కింతురు. అప్పటికిఁ దనహాకామా చెంగులుగరగర చప్పుడుచేయుచుండ నెయ్యార

ముగఁ జనునప్పుడు తనకుఁ బసితనము పోయి పెద్దవాఁడ నగుచున్నానని బాలుఁడు గోటుపడుచుండును.

పాదములకు 'టాబీ' లను దొడుగుకొందురు. టాబీలు దళసరి తెల్లగుడ్డతోఁ జేయఁబడిన మేజోళ్లు. వానియందుఁ బొటన వ్రేలు దొడుగుటకు వేఱుగా నొకభాగముండును.

ఇవి బయటికిఁ బోయినపుడు మేజోడుగాను, ఇంటియందు పైజార్లుగాను వినియోగించును. జపానీయులు బూట్సును వాడుకచేయరు. వారు బయట నడుచునప్పు డెత్తయినకఱ్ఱచెప్పులను దొడిగి యింటికిఁ జేరినతోడనే వానిని గుమ్మముకడ విడిచి టాబీలతో నిల్లుప్రవేశింతురు. దీనికిఁ గారణము మనకు దరువాత తెలియును. జపానుదుస్తులకుఁ జేబులు లేవు. వారు కూడఁ బట్టుకొనివెళ్లవలసినవస్తువులను దట్టీలోగాని కిమోనో చెంగులలోగాని దోపుకొందురు. కిమోనో చాలపొడవుగా నుండి యనవసరమైనవస్తువులనుగూడఁ గొంపోవుటకుఁ జాలినవైశాల్యము గలిగియుండును.

కాని సొగసైనకిమోనోలును విలువగలిగినటొబీలును భాగ్యవంతులకేగాని పేదలకుఁ ధరింప వీలులేదు. పేదలదుస్తులు మిగుల సామాన్యముగా నుండును. కూలివాండ్రు వేసవియందించుమించు దుస్తుల ధరింపక దిగంబరప్రాయులయి



యుందురు. పొట్టిషరాయిని మాత్రము దొడుగుకొందురు. కాని పోలీసువాఁ డంతదూరమున నగపడినతోడనే యడావడిగ నీలిరంగునూలుకోటును బైనఁగప్పుకొందురు. ఎందుచేతనన సరియైనదుస్తు ధరించనివారినిఁ బట్టుకొనుటకుఁ బోలీసువారి కుత్తరువులు గలవు. కూలీలలో నాఁడువాండ్రు నూలుకిమోనోలను ధరింతురు. నలువదియైదు ,,సేనులు,, అనగా రమారమి రెండుషిల్లింగులు లేక రు 1—4—0 లకు వారి యాలుమగల కిరువురకు వారికిఁ దగినచక్కనిబట్టలు దొరకును.

---

## మూఁడవ ప్రకరణము.

### బాలురు—బాలికలు (శేషము)

---

జపానుదేశపుబాలికలును, బాలురును బడికిఁ బోయినతోడనే గురువులకు నమ్రులయి నమస్కరించి దీర్ఘనిశ్వాసము బీల్తురు. ఇది వారికిఁ గలగాఢమయినగౌరవమునకు గుఱుతు. ఇందుకు మాఱుగఁ గురువులు ప్రతినతు లిడి మర్యాద చేయుదురు. తరువాత పిల్లలు తమతమస్థానములం దాసీనులయి పాఠములను జదువుకొందురు.

వారిపుస్తకములు మనకు మిక్కిలి వింతగానుండును. వానియందలియక్షరములు మిగుల పెద్దవిగానుండుటయేగాక తలక్రిందుగా ముద్రింపఁబడి యుండును. మొదటిపుట కావలయునని మన పుస్తకమునకుఁ జివరనుండును. అక్కడనుండి వెనుకకుఁ జదువవలయును. మఱియు మనవలె నెడమనుండి కుడికిఁ జదువుటకు మాఱుగా కుడినుండి యెడమకుఁ జదువవలయును. ఇంతే కాదు. పంక్తులు పుట కడ్డముగా నుండక పైనుండి క్రిందికి వ్రాయఁబడును. దీని నంతను జూడ జపానుపుస్తకము మొదట నత్యద్భుతముగా గోచరించును. వ్రాయవలసివచ్చినప్పుడు బాలురు కలముల నుపయోగింపక వానికిమాఱు కుంచెల నుపయోగించెదరు. ఆకుంచెలను సిరాలో ముంచి పుటకుఁ బైనఁ గుడిచేతివైపుమూల నారంభించి యొకదానిక్రింద నొకటిగ నక్షరములు వ్రాయుచుఁ బుటకుఁ గ్రింద నెడమచేతిమూల ముగించుదురు. ఉత్తరములపైన విలాసము వ్రాయవలసివచ్చి నపుడు దానినిఁ దలక్రిందుగఁ ద్రిప్పి మొదట దేశముపేరుతోఁ బ్రారంభించి మనుష్యునిపేరుతో విలాసము ముగింతురు. గోదావరిజిల్లా రామచంద్రపురంతాలూకా పాలతోడులోనుండు నెండూరి సోమరాజుగారు అని వ్రాయుదురు. [ ఈవిధముగాఁ బైవిలాసములను వ్రాయువాడుక కొంతవఱకు మన దేశమునందును గలదు.]



ఒకవిశేషము గలదు. జపానుపిల్లలు బడియందు నేర్చుకొన్నన్ని విషయము లింటికడఁగూడ నేర్చుకొందురు. ఇంటివద్ద తల్లిదండ్రులు వారికి మర్యాదలును సత్ప్రవర్తనమును జక్కగ శ్రద్ధతో నేర్పుదురు. ఇతరులయెడల నడువవలసిన విధానము జపానునందు సులభముగఁ బట్టువడు నది కాదు. మంచిస్వభావము, నెమ్మది, మర్యాదయు మనకు దెలిసినట్లుండినఁ జాలదు. అచ్చటినడవడి యెంతయుఁ గ్లిష్టమయినయాచారములతోఁ గూడియున్నది. ఎన్నిసారులు వంగినమస్కరించవలెనో యవియెట్లు చేయవలయునో యది యంతయుఁ జక్కగా నుండును. అధికులకు న్యూనులకు వేఱువేఱురీతిగ వందనములు సేయవలయును. స్థితిగతులనుబట్టియుఁ దర్జానుబట్టియు నొకేని వేఱువేఱువిధముగఁ జేయవలసియుండును. ఒకబాలిక అతిథికిఁ దేనీళ్ళగిన్నె నిచ్చువిధమునుబట్టి యామె యేతరగతిలోనిదో తెలియవచ్చుచుండును. కడుచిన్ననాఁటినుండియుఁ బిల్లలకీయాచారములు గఱపఁబడుటచే వారెన్నఁడు నందుదప్పరు.

పసిబిడ్డలకు నడచుట, వంగినమస్కరించుట, పెద్దలకు సాష్టాంగము చేయుట, చేసితిరిగి లేచుట, యివియన్నియు నెంతో ముచ్చటగఁ దాధరించిన కిమోనోచెంగులు చెదరనైనఁ జెదరకుండఁ జేయఁబడును.

ఒకరికడ నెట్లు కనిపెట్టియుండవలయునో, గదిలో ప్రవేశించుటయెట్లో, ఏదేని వస్తువును పైనఁబెట్టవలయునన్న నెట్లో, ఏదియైన నాహారపదార్థమును సరియైనపద్ధతి ప్రకారమెట్లందీయవలయునో, యివియన్నియు బిల్లలకు నేర్పఁబడును. ఒకజపాను షాపులోనికిఁ గొన్నివస్తువులను గొనఁబోయిన యొక లేఖరి యిట్లు వ్రాయుచున్నాఁడు. షాపులోని కతఁడు ప్రవేశించినతోడనే యాజమానియు నాతనిపుత్రకళత్రాదులు నతనికి నమస్కరించిరట. రెండేండ్లపిల్లవాఁ డొకఁడు, తనసోదరివీపున నిద్రించుచుండ నీపెద్దమనుష్యునికి వందనమాచరించుటకు వానినిగూడ లేపిరి. ఆబిడ్డ డులికిపడ్డనైనఁ బడక, యేడువక, నెమ్మదిగ లేచి తన్నెందులకు లేపిరో తెలిసికొని క్రింద నిలిచి తనతల్లిదండ్రు లెట్లు నతిఁ జేసిరో యారీతిని సరిగఁ దనఫాలము భూమిసోఁక నమస్కరించెను. ఇదియైనపిమ్మటఁ దనసోదరిమూపుపైన శాలువలోఁ బండుకొని నిముషములో మఱలనిద్రించెను.

పువ్వుల నమర్చుట, వానితో నలంకారములను జేయుట, బాలక లింటనేర్చుకొను విద్యలలో ముఖ్యమయినవి. జపానీయుల గృహములలోఁ బ్రతివస్తువులు మిక్కిలి చక్కగఁ నమర్పఁబడి చుట్టునున్న వస్తువులతోఁ జెలిమిసేయుచుండును. ఒకపింగాణిగిన్నెలోఁ బూలగుత్తి నమర్పవలెనన్న దానికెంతో యాలోచనమును, జాగ్రత్తయును, గావలయును. పువ్వులను పూలగుత్తులను



మిగులరక్షణీయముగ నమర్చువిధానము పిల్లలకు శ్రద్ధతో నేర్పఁబడును. పనియందుచాతుర్యమును సంపాదించుటకుఁ బెక్కుగృహములం దాయావిధానములును, బొమ్మలును, గలపుస్తకములుండును. ఈవిద్యయందు నేర్పును, అభిరుచియును జపానీయులందందఱికిని నిరుపేదలకుఁగూడ సామాన్యముగఁ గలవు. ప్రసిద్ధికెక్కినయొకశిల్పి యిట్లువ్రాయుచున్నాఁడు.

"ఈజపానీయులసహజమయినశిల్పవిద్యానైపుణ్యము నాకీక్రిందిరీతిని గోచరించినది. నాకడఁ గొన్నివిసనకఱ్ఱలు గలవు. వాని నేనొకనాఁడు గోడ కమర్చుచుంటిని. నాతోఁగూడ జపానునౌక రొకఁడు కలఁడు. నేనాపనిని జేయుచుండ నాకుఱ్ఱవాని కదియంతగా రుచియింపనట్లు వానిముఖవికారమున నాకుఁ దోచినది. రానురాను వానికాయతృప్తి మిక్కుటమయినందున దానికిఁ గారణమేమని నేను వాని నడిగితిని. అందులకు వాఁడు నేనమర్చెడుపద్ధతి తనకు నచ్చలేదని నిష్కపటముగఁ బల్కెను. అట్లయిన నాతోఁ జెప్పవేమి యని నేనడుగ వాఁడు "నీవింగ్లండునుండి వచ్చినశిల్పివి. అట్టివానితో నేఁజెప్పరా"దని నుడివెను. కాని నేను వానిహెచ్చరించి నీయిచ్చవచ్చినట్లు వాని నమర్పుమని నియోగించిన వాఁడట్లొనరించుటయు నేను దానినుండి చక్కనిపాఠమును నేర్చుకొంటిని. వాని కాపని రెండుగంటలు

పట్టినది. అట్లుముగించినతరువాత నది యెంతో చిత్రముగ నుండె
ను. ఏది యెక్కడ నుండవలెనో యచ్చట నుండెను. దేనిని
గదిపినను అంతకును భంగముగలుగున ట్లన్నియు నుచితస్థానము
లయం దుండెను. నేను నమ్రుఁడ నయి యాపాఠము నేర్చుకొని
జపానుదేశస్థులకు శిల్పకౌశల్యము సహజమనియు, వారియం
దావిద్య జీవకళలతో నున్నదనియు మునుపటికంటె గట్టినమ్మ
కము గలిగినవాఁడ నైతిని."

---

## బాల్యప్రకరణము.

### బాలుఁడు

---

జపానుదేశపుబాలుఁ డింట నిరంకుశాధికారమును గలిగి
యుండును. అందలిస్త్రీలస్థితి తక్కినప్రాగ్దేశములందువలె నుండు
ను. బాలుఁడుచిన్నతనమునుండియును పెద్దవాఁడైనతరువాతను
భార్యమీఁదను సోదరీజనంబులమీఁదను నిరంకుశాధికారమును
జెల్లించుచుండును. ఇప్పుడిప్పుడు పైతరగతులలోనిజనులుమా
త్ర మంతకంటెఘనముగఁ జూడఁ బ్రారంభించుచున్నా రనుట



నిశ్చయము. భాగ్యవంతులయిండ్లలోనిస్త్రీలు బాగుగ విద్య
నేర్చి పశ్చిమఖండమువారివలె దుస్తులను ధరించి వారియాచా
రముల నవలంబించుచున్నారు. వారు తమభర్తలతో భోజన
మునకుఁ గూర్చుండుట, బండ్ల నెక్కుట, లోనగుపనులను జేయు
చున్నారు. వారిని బురుషులు ఆంగ్లేయస్త్రీల నాంగ్లేయపురు
షులు చూచినట్లే చూచుచున్నారు. కాని మధ్యతరగతులయం
దును, అధమజాతులయందును బూర్వపుపద్ధతులే యింకను
నిలిచియున్నవి. స్త్రీ కేవలము దాసీప్రాయముగ నుండును.
గొప్పకుటుంబములలోఁగూడఁ బైన నాంగ్లేయాచారములు గన్పి
పించినను, ఇండ్లలోమాత్ర మింకను బూర్వాచారములే యను
సరింపఁబడుచున్న వని చెప్పుదురు. పశ్చిమదేశపురీతి వస్త్రములు
ధరించి బయట నాదేశపుస్త్రీవలెఁ గౌరవింపఁబడినప్పటికిని భార్య
యింటికిఁ జనినతోడనే యాదుస్తులను విడిచి కిమోనో, ఓబీ,
ధరించి మున్ను దనయమ్మమ్మవలె భర్తకుఁ బరిచర్య సేయుట
యే గౌరవమని భావించును.

జపానుదేశమునఁ బురుషునికి బ్రాముఖ్యత యెక్కువ
గుటకుఁ గారణము వారిమతాచారములు. వారికర్మలలోఁ బ్ర
ధానమయినది పితృపూజ. పితృదేవతలను వారు కులదైవము
గఁ గొలుతురు. అందుఁ బురుషులనుమాత్రమే పూజింతురు.

గతించినస్త్రీల కెన్నఁడును వారు శ్రాద్ధమును బెట్టరు. ఆస్తికూడ పురుషవారసులకే సంక్రమించును. కాఁబట్టి జపానీయుఁడెప్పుడును దనయాస్తిని బొందఁగలపుత్రసంతానమునకై యెదురుచూచుచుండును. గనుక వారిలోఁ బుత్రజననము మిగులసంతోషకరము. ఇట్లని బాలికలను నిరసించుటగాని చీనాదేశములోవలెఁ జంపివేయుటగాని జరుగునని మనము తలంపరాదు. అట్లెన్నఁడును జరుగదు. ఆఁడుబిడ్డకూడ మగబిడ్డవలెనే మిక్కిలి ప్రేమతోఁ జూడఁబడును. కాని వంశమున కంతప్రధానముగాఁ బరిగణింపఁబడదు.

మూఁడేండ్లప్రాయమున బాలుని దేవాలయమునకుఁ గొంపోయి మ్రొక్కింతురు. పిమ్మట నైదేండ్లు వచ్చినతరువాత మరల నాలయమునకుఁ దీసికొని వెళ్లుదురు. ఈయైదవయేఁట నాతఁడు పురుషచిహ్నమయిన 'హాకామా'ను ధరించి మగవాఁడ నైతిననుకొనును. ఈప్రాయము మొదలుకొని సంపదగలుగువారు తమబాలుని బడికిఁ బంపి యున్నతవిద్యను జెప్పించుదురు. పేదవారలు పొట్టపోసికొనుటకుఁ బాటుపడనేర్తురు. ఐరోపానుండి జపానునకుఁ బోయి చూచినప్రయాణికుల కందఱకు నచటిచిన్నపిల్లలు చేసెడుపనులనేర్పు మిగుల వింతను గలిగించును. పసిపిల్లలు పుస్తకములకు బైండుకట్టుట, కాగితపులాంతరులను జేయుట, వానిపైఁజిత్తరువులను వ్రాయు



ట, పింగాణిగిన్నెలను జేయుట, సంవత్సరాదినాఁడు దయ్యములుపోఁకకుండ నిండ్లముందు వ్రేలాడఁగట్టుగడ్డిపగ్గములను పేనుట, చాప లల్లుట, మొదలగు లెక్కలేనిపనులను జేయుచుందురు. దంతముల సమర్చుపని నేర్చుకొనుచుండుపిల్లలఁ జూచుట కెంతో వినోదముగ నుండును. జపానుదేశమునందు దంతపుపనివాఁడే యుపకరణము నక్కఱలేకయే పుప్పిపన్ను లోనగువాని నతిసుకరముగఁ దనవ్రేళ్లతో నూడఁదీయఁగలఁడు. వాని శిష్యులా పని నొకబల్లకు గ్రుచ్చఁబడిన మేకులనూడఁదీయుట మూలమున నేర్చుకొందురు. మొదట సత్తుమేకులతోఁ బ్రారంభించి తుదకుగట్టిగా కొయ్యలో దిగఁగొట్టఁబడినయినుపమేకుల నూడఁదీయఁగలుగువఱకు నేర్చుకొందురు.

తరుచు వారికి సెలవులు దొరకుచుండును. జపానీయులకుఁ బెక్కుపండుగలు గలవు. అవి వచ్చినప్పుడు తల్లిదండ్రులును బిల్లలునుగూడ తమతమవ్యాపారములను మాని వినోదమునకై యేదేనియొకతోఁటకుఁగాని యాలయమునకుఁగాని పోవుదురు. వారికి జండాలపండుగయనియొకగొప్పపండుగగలదు. అది యైదవనెలయం దైదవదినమున వచ్చును. దీనినిగుఱించి మఱల ముందు చెప్పుకొందము.

ప్రతిబాలునికిని పితృభక్తియు, రాజభక్తియు, విధాయకధర్మము లని చిన్ననాఁటనే బోధింపఁబడును. జపానులదృష్టియం దీధర్మము లన్నిఁటికంటెను ప్రథమగణ్యములు. ఎద్దియైన నుపేక్షింపవచ్చునుగాని యీధర్మములనుమాత్ర మెన్నఁడు మఱవరాదు. శైశవమునుండియు వానికిఁ దల్లిదండ్రులసంరక్షణకై యసాధారణములయినకార్యముల నొనర్చి యనేకకష్టముల పాలయినబాలురకథలు కరతలామలకములుగ నేర్పఁబడును. "ఇరువదినలువురుసత్పుత్రు" లని యొకగ్రంథము కలదు. దానియందు సత్పుత్రులచరిత్రము లనేకములు వర్ణింపఁబడియున్నవి. ఆగ్రంథము జపానునం దింటింట నందఱు పఠింతురు.

జపానునుగుఱించి ప్రమాణికుఁడైనప్రొఫెసర్ ఛాంబర్లేను కొన్నియుదాహరణములను జెప్పియున్నాఁడు. అవి విరుద్ధముగాఁ దోఁచును. వాని నీక్రింద వివరించుచున్నాఁడ. "ఒకసత్పుత్రునికి సవతితల్లి యొకర్తుకలదు. ఆమె మిగుల క్రూరురాలు. ఆమెకుఁ జేపలయందు మిగుల నభిలాష. చెరువులన్నియుగడ్డకట్టి మంచై పోవుటచే నెచ్చటను మత్స్యములు లభింపవయ్యె. ఆమె క్రూరురాలయి తన్నెంతబాధించినను నోర్చుకొని యాయుత్తమపుత్రుఁడు చేపలకై చెరువునకుఁ బోయి యామంచుమీఁద దిగంబరుఁడై పరుండెను. అతనిశరీరోష్ణముచే మంచు కరగినందున



లోననుండి రెండుచేప లూపిరివిడుచుటకుఁ బైకివచ్చినవి. వానిం బట్టి తెచ్చి యాబాలుఁడు తనసవతితల్లికిచ్చెను,, ఇంతకంటెను జిన్నవయస్సుగల యింకొకబాలుఁడు దనతల్లిదండ్రులకు దోమలబాధ దప్పించుటకుఁ దాను రాత్రియెల్ల వస్త్రవిహీనుఁడై నిద్రించి దోమలన్నియు, దన్నుకుట్టునట్లు జేసికొని తల్లిదండ్రులకు సుఖనిద్రఁ గలుగఁజేసెనఁట!

మూఁడవవాఁ డింకొకఁడు తనతల్లిని బోషించుటకుఁ గొడుకును జంపసంసిద్ధుఁడు కాఁగా భగవంతుం డనుగ్రహించి వానికి బంగారుతో నిండినయొకబిందె నిచ్చెనఁట! దానితో నాకుటుంబము కలకాలము సుఖముగాఁగాలక్షేపము సేయఁగలిగి రఁట! "రోకేయిషి" యనువానికథ యన్నింటికంటెను విరుద్ధముగ నున్నది. ఈతఁడు వయసున డెబ్బదియేండ్లవాఁడయ్యును తొంబదియేండ్లుగల తనతల్లిదండ్రులు ముసలివారమైతి మని వగవకుండఁదాను పసిబిడ్డదుస్తుల ధరించి నేలఁ బ్రాకుచుండెడివాఁడఁట! ఇంతపసిబిడ్డ యుండగఁ దామెట్లు ముదుసలివార మని తల్లిదండ్రు లనుకొనుట కాతఁ డట్లు చేసెనఁట!

జపానీయులకు రాజభక్తి మిక్కిలి ముఖ్యమయినది. ఏమనిన—దానియందు దేశభక్తి కూడఁ గలదు. తనప్రాణము తనదేశముదని యాతఁడు తలంచుటచేత దేశముకొఱకుఁ బ్రాణము

ర్పించుటకు సిద్ధముగా నుండుటయేకాక యట్లర్పించుటకు గర్వపడుచుండును. ఇది మొన్నటిరష్యాయుద్ధములో సంపూర్ణముగ నిదర్శనమై కనబడినది. అనేకమారు లనేకపటాలములు నిశ్చయముగ మృత్యుముఖమునఁ బ్రవేశింపవలసివచ్చెను. ఒక్కరును సంశయింపరైరి. ఒక్కరును గలయందైన నవిధేయతఁ దలంపరైరి. ప్రతిపంక్తియు యుద్ధమునకుఁబోయి యొక్కఁడును మిగులకుండఁ గడపటివాని "బాంజై" యనుయుద్ధపుకేకవినువఱకుఁ బోరి నుడిసిరి. ఇది పిన్ననాఁటినుండియు బాలురకుఁ దమరాజుకొఱకును దేశముకొఱకును బ్రాణము లర్పించుట కీర్తిప్రదమని బోధించినసద్బోధకు ఫలము.

---

## ఐదవ ప్రకరణము.

### బాలిక.

జపానుదేశమునఁ బాలునిగుణములలోఁ బ్రధానమయినది. విధేయతయైయుండును. ఇఁక బాలికజీవిత మంతయు విధేయతమే గాని మఱియొకటి లేదు. శైశవదశ మొదలుకొనియు



బామె తనసంబంధులలో నెవ్వరో యొకరికి విధేయురాలయి యుండుట విధి. జపానుదేశమం దింటింటఁ బ్రతిబాలికయు గంథపాఠముగఁ జదివెడుగ్రంథ మొకటి కలదు. దానిపేరు "ఆన్నా రా డై గాకు" "స్త్రీలఘునతరమైనవిద్య" యని దానికర్థము. బాలికలకును స్త్రీలకును నది నీతిశాస్త్రమై యున్నది. స్త్రీ ముగ్గురికి విధేయురాలయి యుండవలయు ననిదానిలోని మొదటిపాఠము. వివాహముకానప్పుడు తండ్రికిని, వివాహమైనతరువాత మగనికిని, కుటుంబమునందలి పెద్దలకును, వితంతువైనప్పుడు కుమారునికి స్త్రీ విధేయురాలయి యుండవలయును. [మనమనుస్మృతియు నిట్లే బోధించుచున్నది.] మూఁడేండ్లు వచ్చువఱకు జపాను బాలికకు వివిధరీతులుగ క్షురకర్మను జేయించుచుందురు. మూడేండ్లుదాఁటినతరువాతఁ జుట్టు నెదుగనిత్తురు. ఏడేండ్లు వచ్చువఱకు మెత్తనిపట్టు "ఓబీ"ని గట్టుదురు. ఇది శైశవపుదట్టీ. పదేండ్లప్రాయమునఁ దరుచును, విశాలమునగు "ఓబీ"ని, దాని కొక పెద్దవిల్లువంటియాకారముగలదుస్తును గట్టి ధరింతురు. అప్పటినుండి యాబట్ట లన్నియు యథావిధి స్త్రీదుస్తులయి యుండును. ఇప్పు డామె మూజూమ్ లేక మూస్మె యని పిలువఁబడుచు నత్యుల్లాసముగఁ దిరుగుచుండును. ఆమె యెప్పుడును బొద్దదిగాఁ గనఁబడదు. ఏమన బాగుగ నెదిగినపిమ్మట నాలుగడుగులయెనిమిదంగుళములకంటె నెక్కువపొడ వుండదు. అయిదడుగులపొడవున్న స్త్రీ జపానుదేశమున రాక్షసియే.

వింతవింతరంగులుగలనీటుదుస్తులను గట్టుటకుజపానుతరుణులకిది యే తరుణము. పెండ్లియయినతరువాత: ప్రశాంతమైన యుడుపులను ధరించవలెను. కొందరు మూస్మేలు (జపానుబాలికలు) గలిసి యేదేనియుత్సవమునకుఁగాని తీర్థమునకుఁగాని పోవుటఁ జూడఁ జక్కనిపూలచెండ్లు గంతులువేయుచున్నట్లు తోఁచును. వారు, నలుపు, తెలుపు, నీలము, ఎఱుపు, పసుపు, లోనగుసప్తవర్ణములవింతవింతచిత్తరువులతో నిండియుండినచిత్రవిచిత్రములయిన కిమోనోలను ధరింతురు. ఇట్లు వారేగునప్పు డొకచిన్నజల్లు వచ్చినట్లైన వారందఱుఁ దమకిమోనోలను పైకిఁ గట్టుకొన లోనఁదొడిగిన క్రిందికిమోనోలు ప్రకాశమానమైనయెఱుపురంగుగలిగి యార్ద్రపుష్పవాటికవలెఁ గాన్పించును.

ఇవి వింతదుస్తులను ధరించుటకే గాక యాలయములు తీర్థములు, మొదలగువినోదములఁ జూడఁబోవుటకుఁగూడఁ జపాను బాలికలకుఁ దరుణము. ఏమనిన వివాహమయినతోడనే చాల కాలమువఱకు కామె కిట్టివినోదముల ననుభవించుటకు వీలు లేదు. తనకొడు కెదిగి కోడలు కాపురమునకు వచ్చి తనపను లన్నియు నామెపై వేసుకొనువఱకుఁ జపానుదేశమున నిల్లాలు గృహకృత్యములు నెఱవేర్చుకొనుచు నింటనే యుండవలయును. తనస్థానము



వంబనిచేయుటకుఁ గోడలు వచ్చినతరువాతనామె గుళ్లకు గోపురములకుఁ దీర్థములకు, సార్థములకు నాటకములకుఁ బాటలకుఁ బోవుటకు వీలుపడును.

జపానున వివాహము బాల్యముననే [హూణులయభిప్రాయప్రకారమివిబాల్యవివాహములుగాని మన కవి ప్రౌఢవివాహములే] జరుగును. బాలికకుఁ బదునాఱు, పదునేడువత్సరముల యీడునఁ బెండ్లియగును. ఇరువదియేండ్లవఱకు వివాహముకాకుండుట దురదృష్టముగా నెంచఁబడును. వివాహముకాఁగానే బాలిక తల్లిదండ్రులనుండి పూర్తిగా విడిపోయి యత్తవారింటికేగును. ఇందుకు గుఱుతుగా నాబాలిక విచారసూచకమగు తెల్లకిమోనోను ధరించును. ఇంతేకాక పెండ్లికూఁతు రత్తవారింటికిఁ బోవునప్పుడు శవమును స్మశానమునకుఁ గొంపోవునప్పుడువలెఁ బ్రాయశ్చిత్తాగ్నులను వెలిఁగింతురు. ఆబాలిక నాఁటినుండి పుట్టింటివారికి మృతసమాన యనియు, నింక దానిజీవితమంతయు నత్తవారింటఁ గడుపవలయు ననియు దీనిభావము.

వీరివివాహకర్మ యతిసూక్ష్మము. బహిరంగమయిన యుత్సవముగాని మతకర్మగాని లేదు. ఒక్కొక్కదానికి రెండు రెండువొప్పున కొమ్ములుగలమూఁడుపాత్రములతో వధూవరులుభయులు మున్మూఁఱుమున్మూఁఱు మధుపానముఁ జేయు

టరయే ప్రధానమైనకర్మ. ఈపాత్రములలో 'సాకె' యను నొకపథ
మయిన యన్నపుసారాయమును బోయుదురు. ఇప్పటినుండి
వధూవరు లొకరిసుఖదుఃఖముల నొకరు పంచుకొని యనుభ
వింతు మనుట దీనిభావము. ఇట్లు మధుపానము సేయుటతో
వివాహము సరి. [వీరివివాహకర్మ యైరోపియునికిండ్లకే నూ
త్నమయినదిగఁ దోఁచినప్పుడు కర్మబాహుళ్యము గలమన కెట్లుగ
నిపించునో చెప్ప నక్కఱలేదు. ఈవిషయమును స్త్రీయత్త
వారింటికిఁ బోయినతోడనే పుట్టింటివా రామెను మృతసమా
నముగ నెంచి యేడ్చి యపరకర్మవంటికర్మఁ జేయుటయు మనయా
చారములకుఁ బ్రబలవిరోధమును గలిగియున్నవి. తక్కినస్త్రీ
ధర్మము లన్నింటియందును మనకును జపానీయులకును జాల
సంబంధము గనఁబడుచున్నది.]

ఇట్లు వివాహమయిననాఁటినుండి యాపడుచు తనసొగ
సుదుస్తులకును, ఆటపాటలకును, నీళ్ళు వదలుకొనవలెను. ఆమె
ధరించువస్త్రములు పావురమురంగుగాని, బూడిదరంగుగాని
కలిగి ప్రశాంతములయినయంచులతో మనోహరముగా నుండు
ను. ఆమె యుదయమున లేచినతోడనే తలుపులను దెరువవ
లయును. ఈపని నామె సేవకులచేఁ జేయింపరాదు. అత్తమా
మలు దనయింట నివసించుచున్నప్పుడు వారికిఁ గావలసినపనుల



న్నియు నామె స్వయముగఁ జేయుట గౌరవాస్పదముగ నెంచు
కొనవలయును. ఆమె తనయత్తగారికి దాసివలె సేవలొనర్పవల
యును. ఇట్లందఱకును నొదిగి చాకిరిచేసినయిల్లాలు తనకోడలు
వచ్చినతరువాత నామెపాలిటికిఁ బెద్దపులివలె నుండి పనులను జే
యించుచు నామెను దుఃఖములపాలు సేయుననుట వింతకాదు.
అత్తకు బానిసకాలము దాఁటిపోయినది. ఇప్పు డామె వేకువ
లేచి తలుపులు దెఱవ నవసరము లేదు. ఆమె పన్నుండి కోడలి
చే నుపచారములు చేయించుకొనవచ్చును. ఆమెయిష్టము వ
చ్చినట్లు అక్కడకు నిక్కడకుఁ బోవచ్చును. వినోదముల నన్నిం
టిని దాఁటిపోనీక యనుభవించును. ఇప్పటినుండి యామె మఱి
లసుఖపడుట కారంభించును.

అతివేగముగలప్రవాహముతో జపాను నాక్రమించుచున్న
పాశ్చాత్యప్రభావముముందర నీపద్ధతు లెందాకనిలుచు నని
యొకసంశయము కలుగుచున్నది. వ్రేళ్లుపారి పాదుకొనియున్న
యాపద్ధతుల కిప్పటివఱకుఁ జలన మేమియుఁ గలుగలేదు. కాని
తననిండుజవ్వనమునాఁటి మేలుదినములను అత్తమామలకును
మగనిచుట్టాలకును బ్రతిఫలము లేనిపరిచర్యలతోఁ గడుపుకొల్ల
కజపానుబాలిక ముందుముందు తిరుగఁబడక మానదని తోఁచు
చున్నది. అయిన నిప్పటికిమాత్రము ప్రాచీనాచారములు
దృఢముగ నెలకొని యున్నయవి.

పూర్వము వివాహమైనప్పుడు స్త్రీని సాధ్యమయినంత వఱకుఁ గురూపిణినిగాఁ జేయుట వాడుకగా నుండెను. కానఁ బరులెవ్వరు నామెపై దృష్టి సారింపరాదని వారితాత్పర్యము. విధాయకముగ వారు పండ్లకుఁ గప్పు వేసికొనెడివారు. దానివలన వారు నవ్వినప్పు డత్యసహ్యముగా నుండెడిది. ఇప్పటికిని బండ్లకుఁ గప్పు వేసికొను స్త్రీలు చాలమంది గనఁబడుదురు. కాని యీయాచార మిప్పుడు నశించుచున్నది.

స్త్రీకి వైధవ్యము తటస్థించినయెడల నామె తనదుఃఖమును దనయాకారమువలనఁ దెలియఁజేయవలయును. ఆమె కురులను దీయించుకొనవలయును. విషాదసూచకములయిన వస్త్రములను ధరించవలయును. జపానునందు, బాలిక చక్రవాకమనియు, నిల్లాలు పావురమనియు, వితంతువు కాకియనియుఁ జెప్పుకొందురు. [స్త్రీధర్మములలో హిందువులయిన మనకును, జపానీయులకును జాల సమానధర్మములు గనిపించుచున్నవి. పతికి సేవచేయుట, అత్తమామలకుఁ బరిచర్యలొనరించుట, గృహకృత్యములను నెఱవేర్చుకొనుట, కన్యయై తల్లిదండ్రులకును, గృహిణియై భర్తకును, వితంతువై కుమారులకును విధేయురాలయి యుండి జీవయాత్రను బరమార్థప్రధానముగాఁ గడపుట, క్రీడావినోదంబులను మితిగలిగి యనుభవించుట మున్నగు ప్రధానధర్మము లన్నియు మనకును వారికిని సమానములుగా నున్నవి. వితంతుశిరోముండనము వస్త్రధారణముగూడ నొకేరీతి నున్న



వి. ఈధర్మములు గ్రంథకర్తగారగు ఫిన్నిమోర్ దొరగారికి వెగటుగాఁ దోఁచి యచటి స్త్రీజీవితము దాస్యతుల్యమని వ్రాసినారు. గాని యది మితిమీఱిన స్వాతంత్ర్యములు పరమార్థచింతయంతగా లేక వివాహమైహలౌకికమేగాని పారలౌకికము గాదనియు నది యొకనిబంధన(కంట్రాక్టు) మాత్రమే యనియు, మొదలగు నభిప్రాయములుగల స్త్రీలుగలయైరోపియనులకును అట్టితలంపులు గలిగినకొందఱుమనవారికిని దాస్యతుల్యముగను సుఖానందరహితముగను గానిపించును గాని సవిమర్శముగా నాలోచించినయెడల నట్లనుటకు వీలుపడదు. శరీరపాటవము బాగుగ నున్న యౌవనమునఁ బొంగిపొరలి వెల్లువలై పారునింద్రియవాంఛలను మితికి లోఁబఱచుకొని శక్తులుడిగి వయసు మీఱియున్న యత్తమామలకును, ప్రత్యక్షదైవమై తనకెల్లవిధముల సుఖము నాపాదింపఁ బడఁగలపాట్లెల్లం బడి యిహపరముల సాధించుభర్తకును శక్తివంచనలేకుండ పరిచర్యలుచేసి పరమార్థమును సంపాదించుకొని తనకు దేహదార్ఢ్యము తగ్గినప్పుడు తనకోడలిచే మరల నుపచారములు చేయించుకొనుచు సుఖపడవీలుపడిన జపానీయస్త్రీలధర్మములు సర్వథా శ్లాఘనీయమైయున్నవి కాని, నిందార్హములు కావని తోఁచుచున్నది. దీనింగూర్చి విపులముగఁ జర్చించుట కిదితావు గాదని యభిప్రాయమును సూచించి విడిచితిని.

## ఆఱవప్రకరణము.

——:o:——

### గృహము.

జపానులగృహము సామాన్యముగ నుండును. పూరితోఁగాని పెంకులతోఁగాని వేయఁబడిన కప్పును, దానినిలుపుటకుఁ గలస్తంభములును, మాత్ర మింటికిఁ బ్రధానభాగము లని చెప్పవచ్చును. పగటిపూట నూనెకాగితపుటట్టలును, రాత్రిపలచనిబల్లచెక్కలును గోడలుగ నమర్పఁబడును. ఇండ్లన్నియు సాధారణముగ నొకేయంతస్తును గలిగియుండును. వీరియిండ్లింత పొడుగా నుండుటకు బలమయినకారణములు రెండుగలవు.

అందు మొదటికారణము తరుచుగా నిచట భూకంపములు గలుగుట. అవి కలిగినప్పుడు భూమి కదలి యిండ్లు విరిగి మనుష్యులమీఁదఁ బడుచుండును. అట్టిస్థితిలో బలమయినరాతిగోడలతోఁ గాని యిటుకగోడలతోఁగాని యిల్లుండుట హానికరమును, దిరిగికట్టుకొనుట మిగులవ్యయహేతువు నగును. రెండవకారణ మాదేశమున నగ్నిభయ మెక్కువ. అచటిజనులకు జాగ్రత లేదు. వారు చౌకదీపములను జౌకచమురును వాడుదురు. అందుచేత దీపములు పగిలి నూనెమండి కాగితపుగోడ లంటుకొనును. అది యన్నిప్రక్కలకు వ్యాపించి కొన్నివీథులు



గాని యొకపేటగాని లేదాయొకయూరుగాని పరశురామప్రీతి యగును. జపానీయుఁడు దీని కేమియు సంచలింపఁడు. వెంటనే కొన్నిరాటలు పాతి మునుపటిపెంకులతోడనో క్రొత్తపూరిగడ్డితోడనో పైకప్పు నేర్పఱచి తనకాగితపుగోడలతోడను బల్లచెక్కలతోడను గీమును మరల సిద్ధముచేసికొనును.

వారిలోఁ బేదవారియింటికిఁ బగలొకపెద్దగది మాత్ర ముండును. రాత్రి యజమాని తనకుటుంబమున కెన్నిగదులు కావలయునో యన్నిగదులుగ దానినే విభజించును. ఇంటియడుగుభాగము నేలపై నొకయడుగెత్తున నుండును. దానిమీఁద నిలువుగాను అడ్డముగాను గాడ్లు చెక్కఁబడియుండును. 'షోజి'యనుపేరుగల, కాగితములతోఁ గప్పఁబడినచట్రములు దీనిగాడ్లలో వేయుటకును దీయుటకును వీలుగా జరుగుచుండును. ఈ కాగితపుబల్లలు గదికి మధ్యగోడలవలె నేర్పడును. ఇంటిముందుభాగము సాధారణముగ వీథివైపునకుఁ దెఱచియుండును గాని మఱుగుకావలసినప్పు డొకకాగితపుతెఱ వేసికొందురు. రాత్రులందు 'ఏమేడో' యనుప్రమాణతలుపులు కాగితపుఁదెరలను గప్పును. ఈతలుపు లొకదాని కొకటి యాధారముగ నిలిచి కడపటిదాని కొకగడియ వేయఁబడును.

జపానీయులకుఁ బరిశుభ్రమయినగాలియందును, ఎండ యందును మిగుల నభిలాష. మిక్కిలిగ వర్షించుచున్నప్పుడును జలి వేయుచున్నప్పుడును దప్ప తక్కినయన్ని సమయములయందును వారియింటిముంగిలి యెప్పుడును దెఱువఁబడియుండును. ఎండ వేఁడిమి సహింపరానప్పు డొక తెరను నీడకొఱకు వేసికొందురు. ఆ తెరమీఁదఁ దరుచుగా నింటియజమానిపేరు వ్రాయఁబడి యుండును. ఇంగ్లీషువారు నిట్లే తమపేరును దమయింటిసింహ ద్వారపుతలుపుమీఁద నిత్తడిరేకుపై వ్రాయించుకొందురు. ఈ జపానీయులయిండ్లలోనిసామానుకూడ సామాన్యముగా నుండును. దళసరిగలిగినచాపలు క్రిందఁ బఱవఁబడి యుండును. ఇవి కుర్చీలుగను, పరుపులుగను గూడ వినియోగించును. వారుకూర్చుండుటయు నిద్రించుటయుఁగూడ వానిమీఁదనే. భోజనమున కొకచిన్నపీట చాలును. కాఁబట్టి యీ దేశమున దంపతులు కాపురముచేయుట కడు సూక్ష్మముగఁ జేలును. దీనిఁగూర్చి మిసెస్ బిషప్పనునామె యిట్లువ్రాయుచున్నది. "ఇతర దేశములరీతి యిండ్లను సామానులను, జీవించుపద్ధతులను జపానీయులవలంబింపక నిరసించుటకుఁ గలబలమైనకారణములలో నొకటి దానివలనఁ బాల్యవివాహములు చేసికొనుటకు వీలులేనట్లుగ వ్యయమెక్కువగుటయై యున్నది. ప్రస్తుతము సామాన్యులలోనిదంపతుల కావశ్యకముగఁ గావలసినవి. వట్టిచాపలు పఱచిన



గదియొకటి. (అదివిభజనార్హమైనను సరియే కాకున్నసరియే) రెండు కొయ్యతలగడలు; కొన్ని దూదిబొంతలు; పగలుతలదాఁచుకొనుట కొక తెఱ. (జరుగుటకు వీలయినది) ఒకకొయ్యబీరె; ఒకయినుపకాగు; చలిగాచుకొనుటకు వండుకొనుటకు నొకపొయి; ఒకటిరెండుతొట్టెలు; ఒకటిరెండు తేనీళ్లకుండలు; కొన్నితువాళ్లు; తుడుచుకొనుట కొక వెదురుచీపురు; పొగద్రాగుటకు గొట్టము; ఒకయినుపకుండ; కొన్ని అలమారులు; ఇవియన్నియు రెండుపౌనులకు అనగా ముప్పదిరూపాయలకు లోపు మొత్తమునకు దొరకును.

ఇట్లు కాపురచేయుదంపతులు మిగులసౌఖ్యముగాఁ గాలముగడపుచుందురు. అవసరమైనచో నింతకంటెను దక్కువవెచ్చముతోఁ గాపురము సేయవచ్చును. కూలివాం డ్రచ్చట పదిహేనురూపాయలమొత్తముతోఁ జక్కనికాపుర మేర్పఱచుకొనవచ్చునని ప్రమాణికులు చెప్పుచున్నారు.

భాగ్యవంతులయిండ్లుకూడ నీరీతిని సామాన్యముగనే యుండును గాని యందలికలప విలువగలిగినదై యందలిసామానుకూడ విలువగలకఱ్ఱతో జేయఁబడి యుండును. ఫరంబీమీఁద జిలుగునేయఁబడి క్రింద నరుదైనమనువుబల్లలు గూర్పఁబడియుండును. గదులమధ్య, వారిండ్లలోకూడఁ దెఱలనే వాడుదురు.

రాత్రులు వానిని 'ఏమేడో' లనుబల్లలతో మూయుదురు. తలుపులుగాని ద్వారములుగాని వేఱే లేవు. ఒకగదిలోనుండి యింకొకగదిలోనికిఁ బోవలసినయెడల షోజీలను త్రిగించుకొని పోయి మరల వానిని వేయుచు నీరీతి నొకగదిలోనుండి యింకొకగదిలోనికిఁ బోవలయును. ఈషోజీలమీఁద (తెరలు) నందముగాఁ జిత్తరువు చెక్కఁబడియుండును. ప్రతిగదిలోను నొక 'కాకిమోనో' వ్రేలాఁడఁగట్టఁబడి యుండును. కాకిమోనో యన నొక పట్టుగుడ్డమీఁదఁ జక్కఁగ వ్రాయఁబడినబొమ్మ. దానిమీఁద సాధారణముగఁ బుష్పించినద్రాక్ష (Cherry) తీఁగను వ్రాసికొనుటయందు వారికభిలాష. దీనిని తెల్లనిపట్టుమీఁద వ్రాసినప్పుడెంతో మనోహరముగా నుండును.

వారిండ్లనుఁ బొగగొట్టము లుండవు. [ఇంగ్లండులోవలె] దీనికిఁ గారణము జపానీయులకు యూరపునందువలె నెప్పుడు నిప్పుండుచో టుండదు. వారివంట బొగ్గులుమండెడు నొకసామాన్యపుపొయ్యిమీఁదఁ జేసికొందురు. దానిపొగ కాగితపుగోడల సందులలోనుండి విచ్చలవిడిగాఁ బోవును. చలికాలములో ముడుచుకొనికూర్చుండి చిన్నచిన్న హిబాచీల నచ్చటచ్చట వ్రేలాఁడఁగట్టుకొందురు. హిబాచీలనగా నొకవిధమయినలోహపుపాత్రలు. వానిలో బొగ్గులు మండుచుండును.



గదులలో కుర్చీలుగాని బల్లలుగాని యుండవు. క్రిందఁ జక్కనిచాపలు పఱచియుంచుదురు. అవి మంచువలెఁ దెల్లగాను శుక్కములవలెమెత్తగాను నుండును. ఏమనన వి రెండుమూఁడంగుళములు దళసరిగలిగి యుండును. వాటిని మెత్తనిగడ్డితో నల్లుదురు. వీనిమీఁద జపానీయులు బాసినపట్టు వేసికొని కూరుచుందురు. భోజనసమయమం దెత్తులేనిచిన్నపీటలను వేసికొందురు. భోజనమయినతరువాత మఱల నాపీటలు దీసివేయుదురు. వారెప్పుడును గుర్చీలను వాడరు. పాశ్చాత్యపద్ధతుల నవలంబింపఁగోరుజపానీయుఁడు కుర్చీమీఁదఁ గూర్చుండుటను, యూరోపాదేశీయుఁడు నేలమీఁద బాసినపట్టువేసికూర్చుండుటనువలె జాగ్రత్తగా నేర్చుకొనవలసియుండును.

పండుకొనవలసినప్పుడు గదిమారదు. పగలు కూర్చుండుట కుపయోగించుసావిడి రాత్రి పడకగది యగును. అలమారులో నుండి కొన్నికొయ్యతలగడలును బొంతలును దెచ్చి బొంతలను బఱచి తలగడల నుచితస్థానములం దుంచుదురు. దీనితో పాను పేర్పడును. మన కీతలగడలుమిగుల యిబ్బందిగా నుండును. అవి మెడనానుటకు వట్టి కఱ్ఱముక్కలు. వానినుపయోగించిన యూరోపాదేశీయప్రయాణికులు తలుపుగంధిమీఁద మెడ బెట్టుకొని నిద్రించుటలాగున నుండు నని చెప్పిరి.

వారు చాపలమీఁదనే కూర్చుండి చాపలమీఁదనే పరుం
డుదురు గావున వారింటియందు బూట్సుమొదలగుజోళ్లను దొ
డగకొండుటకుఁ గారణ మదియని మనకుఁ దెలియుచున్నది.
అట్లు తొడిగినయెడల వారియందమైనచాపలు మలినమై పోవు
ను. కాబట్టి వారు జోళ్లను గుమ్మమువద్ద విడిచి యింటిలో టాబీ
లు లేక మేజోళ్లతో నడతురు.

---

## ఏడవ ప్రకరణము.

### గృహము (శేషము)

ఒకవేళఁ గొందఱు భాగ్యవంతులగుజపానీయులకుఁ జక్క
నిచిత్రములు వ్రాయఁబడిన తెరలును, అందమయిన గిన్నెలును,
జిలుగుచెక్కిన మేజాబల్లలును, లోనగుసామానులున్నను వా
ని నింటిలో నుంచరు. వానిని ప్రత్యేకముగ నొకయింటిలో
నుంచి కావలసినప్పుడు సేవకునిఁ బంపి తెప్పించుకొందురు. ఆ
వస్తువు పనితీరినతోడనే దానిని మరలఁ గొనిపోయి యాయిం
టియందు భద్రము సేయుదురు.



ఈయింటికి 'కొట్టు' అనిపేరు. అదిసున్నముతోఁ గొట్టఁ
బడి నల్లరంగు వేయఁబడి యుండును. దానిమీఁద యజమానుని
యొక్క పేరు పొడియక్షరములతోఁ దెల్లరంగున వ్రాయఁబడి
యుండును. దానికగ్నిభయము లేదని గృహస్థులు ద్రవ్యముల
నందు దాఁచుకొందురు. కాని వానికి నగ్నిభయము లేదు. దాని
యందనేకవిధములయినచక్కనిసామానులును, నగలును గు
ప్తములయి యుండునుగాని వానినెప్పుడో యరుదుగాఁగాని సూ
ర్యరశ్మి సోఁకదు.

జపానీయులు తమయింటిని సర్వదా తమకుఁ గలయలం
కారములతో నలంకరించుకొని నివసింపరు. చక్కనిపింగాణి
గిన్నెలు కొన్నిరకములున్న నొక్కప్పు డొకరకము నింకొకప్పు
డింకొకరకమును దీసికొని వాడుకొందురు. ఒకరకము తెలికొ
కమాదిరిగిన్నె లుండవలెను. ఈరీతిగా మార్పుగలిగినప్పు డెల్ల
నింటియందున్న బాలికలు వానినన్నింటిని జక్కనివిధముగా నమ
ర్చుటకుఁ దమనేర్పునంతను వినియోగించుచుందురు. ఇంటి కతిథి
వచ్చినప్పుడు రోజుకొకవిధముగ నాతఁ డుండుగది నలంకరింతురు.
ఒకగిన్నెలో నెప్పుడును గ్రొత్తగాఁగోసినపుష్పములును లతలును
సిద్ధముగనుండును. దీని నెప్పుడును 'టోకొనోమా'కు ముందుం
చుదురు. "టోకొనోమా" ప్రతిజపానీయునియింటను నుండును.

అవి యొకవిధమైనచిన్నగది [మనకు "దేవుఁడుపట్టు" అని చిన్నయఱుగొకటి పడమటింట నుండును.] ఆశబ్దమునకు "ప్రక్కవేయు చోటి" నియర్థము దాని నతిథిమందిర మని చెప్పవచ్చును. చక్రవర్తియగు మికాడో తమయింటి కెపుడయిననతిథిగావచ్చినప్పుడు వారి నందు విడియించు టాఁగదిని వేఱుగానుంచుట కుద్దేశము. ఇట్లింటను జక్రవర్తికొఱ కొకగది సిద్ధపఱచియుంచుట జపానీయులస్వామిభక్తిని దెలుపుచున్నది. వాస్తవముచేతఁ జక్రవర్తి వచ్చుటెప్పుడును తటస్థింపదు గనుక "టోకోనోమా" నామమాత్రమే యయియున్నది.

అది సాధారణముగా గొన్నియడుగులపొడుగును, గొన్నియంగుళములవెడల్పును గలిగియుండును. దానిమీఁద నింటియందున్న వానిలోనికెల్లఁ జక్కనిదైన "కాకిమోనో" వ్రేలుచుండును. దానికి ముందొకగిన్నెలోఁ బుష్పము లొకవిధముగ నమర్పఁబడి యుండును. ఆయమర్చినరూపమున కొకయంతరార్థముండును.

రాత్రులు గదులలోఁ గాగితపులాందరులో గ్రొవ్వువత్తులతో దీపములు బెట్టుకొందురు. అలాంతరు నొకలక్కపీటమీఁద నుంచుదురు. దీనివెలుతురు కాంతిహీనముగ నుండుటంబట్టిచాలమంది యైరోపాదేశీయములయినదీపముల నుపయోగించుచున్నారు. కాని, మిక్కిలి చౌకరకముదీపముల నుపయోగించుటచే పాపము ప్రమాద మెక్కువగ నున్నది. చిన్నచిన్నగుడిసెలు గట్టుకొని యూరివెనుక నివసించుకూలిజనులయిండ్లు నిశ్చయముగఁ జలనగృహములయి యున్నవి. వారు తమసామానులనే గాకయిండ్లనుగూడఁదమతోఁ గొనిపోయి తమకువలసినచోట గృహమును, సామానును మరల నమర్చుకొందురు. ఇట్లు గృహములతోఁ బ్రయాణములు సేయుట సాధారణముగాఁ గావచ్చును. మగవాఁడు కాగితపుటింటిని, ఆఁడుది సామానును మోసికొని ప్రయాణముచేయుచుందురు. ఇట్లు కొన్నిగంటలు ప్రయాణముచేసి తమ కిష్టమయినచోట గృహసహితముగ వసియింతురు.

---

## ఎనిమిదవ ప్రకరణము.

### దినచర్య.

జపానుగృహములందు మొట్టమొదట వేకువను మేల్కొంచునది గృహిణి. శయ్యనుండి లేచినతోడనే యామె రాత్రియంతయు వెల్గుచున్నదీపముల నార్పివేయును. జపానీ

ము లెవ్వరును దీపము లేకుండ నిద్రింపరు. ఆన్‌డన్, అని యా దీపములకుఁ బేరు. అది పొడుగుగా నుండి కాగితముతోఁ జేయఁబడును. దీపము నార్పినపిమ్మట కఱ్ఱతలుపులను దీసి సేవకులను బిలుచును.

ఇఁకఁ బ్రాతఃకాలభోజనము సమర్పింపఁబడును. ఒకవిధముగా నిది మిగుల సుకరమయినది. దీనికి మేజాబల్లగాని, దానిమీఁదికిఁ గుడ్డగాని, యక్కఱలేదు. బల్లలును గుడ్డలును వారెఱుంగరు. అన్నము డికి, తేనీళ్ళు కాఁగినతోడనే భోజనము సిద్ధమగును. కాని, యొకవిషయమున నామె మిగుల జాగరూకత గలిగి యుండవలెను. కుటుంబమునందలి మనుష్యులతారతమ్యమునుబట్టి లక్కతోఁ జేయఁబడిన యన్నపుగిన్నెలును, తినుటకు నుపయోగించెడుపుల్లలును, సరియైనవరుసలో నుంచవలెను. ఆవరుసలో నేమాత్రము పొరబాటు జరిగి కుటుంబములోని వారికిఁగాని, యతిథికిఁగాని, యుక్తస్థానము దప్పినయెడల నది మిక్కుటమయినయగౌరవముగాఁ జూడఁబడును. భోజనముకంటె వేయిమడుగు లీగౌరవ మెక్కుడుప్రధానముగా నెంచఁబడును. అడుగంటినయన్నమును గాటుపోయిన తేనీళ్ళను బెట్టిననుసరే. యవి యుచితమర్యాద ననుసరించి యొసంగఁబడినఁ జాలును కాని త్రిగుణగౌరవార్హునికంటె ముందుగా ద్విగుణగౌర



వార్హునికి భోజనము పెట్టినయెడల నది యాకుటుంబమున కెన్నఁటను దొలఁగనియప్రతిష్ఠఁగలిగించును. [ఈయెగువపీటలు దిగువపీటలుమర్యాద మనదేశమునందును గలదు]

ప్రాతఃకాలభోజన మయినపిమ్మట యజమానుఁడు దన పనిమీఁదఁ బోవును. వర్షము లేకయున్నయెడల భార్య పెనిమిటి వ్యాపారమునకుఁ బోవుటకు గడ్డిపాదరక్షలను దొడుగుటకు సిద్ధముగా నుంచును. వర్షము గురియుచున్నయెడల నెత్తైనకఱ్ఱచెప్పులను, నూనెకాగితపుగొడుగును నిచ్చును. పిమ్మట నాతనిని బరిచారికలును భార్యయు ద్వారమువఱకు సాఁగనంపి మోకాళ్లు నలుపుకొనుచు నసేకనతు లొనరించి దీవించి వెనుకకు వత్తురు.

అట్టిసమయములో దాసీజనంబులుగూడ యజమానురాలితోఁగూడ వర్తించుట మనకు విరుద్ధముగఁ దోఁచవచ్చును. కాని జపానునందలి సేవకులు తక్కినచోట సేవకులవంటివారు గారు. వారు కుటుంబమునందలిపిల్లలవలెఁ జూడఁబడుదురు. గృహదాస్యము జపానున నతిగౌరవమయినవృత్తి యయి వర్తకముకంటె ఘనతరముగ నెంచఁబడును. గృహసేవకుఁడయియుండి వర్తకమువలన జీవించువారిపిల్లను బెండ్లియాడినయెడల నాతనికి కులగౌరవము తగ్గును. మొన్నమొన్నటివఱకును జపాను

నందు వర్తకము హీనజాతులవారలచేతులలోనుండి వారిని కూ
లీలకోసమానులనుగాఁ జూచుచుండిరి.

గృహసేవకుల కిట్టిగౌరవము కలుగుటకుఁగారణములు
రెండు. అందు మొదటి దెంతగొప్పవారియింటనుగూడ భార్య
భర్తకును, అత్తమామలకును, దాను స్వయముగ నుపచార
ములు సేయవలయు ననునాచారము. దీనింబట్టి గృహసేవ యు
త్తమున మయినపదవికి వచ్చినది. రెండవది జపానుసేవకులలో
జాలమంది సత్కులములయందుఁ బుట్టినవారలయి యుండుట.
ఒక్కతరమునకు ముందు వారిపూర్వులు "సామురాయిలు"గా
నుండిరి. మొన్న మొన్న జపాను సామంతరాజులయధికారములో
నున్నప్పుడే సామురాయీలస్థితి 1745వ సంవత్సరమున స్కా
ట్లండులోని ప్రముఖులస్థితితో సమానమై యుండెను.

డైమియోలకుఁ బెద్దసంస్థానములును, విస్తారము రాఁబ
డియు నుండెడిది. ఈరాఁబడి ధాన్యమునుబట్టి లెక్కింపఁబడు
ను. ఒకడైమియోకు 1000000కోకుల ధాన్యము వచ్చును.
కోకు అనగా 182పౌనులు. ఈయాదాయముతో నాతఁడు తన
సామురాయిసైన్యము నంతను బోషింపవలయును. ఈసాము
రాయిలును స్కాట్లండువారును, సమానస్థితిలోనివారుగా నుం
డిరి. నిరుపేద యగువాఁడుగూడఁ దన్ను పెద్దమనుష్యునిగఁ బరి



గణించుకొని తనడైమియోయొక్క వంశస్థునిగా నెంచుకొనును.
వానికి వర్తకమును, చేతిపనులును, నసహ్యకరములుగా
నుండును. యుద్ధమును, దనయజమానునిఁ గాపాడుట
యు, నాతనివిధులు. గాని తనయజమానునియింట సేవకుఁడై
యుండు టెంతయు శ్లాఘాపాత్రము. ఈరీతిని గృహసేవ గౌర
వమైనవృత్తులలోఁ జేరినదయ్యె. సామంతరాజ్యము నశించి డై
మియోలు జనసామాన్యములోఁ గలిసిపోయి సామురాయిలు
విడిపోయినపు డీకడపటివారు సకుటుంబముగ నుదరపోషణము
నకుఁ బాటుపడవలసివచ్చినందున వారిలోఁ జాలమంది గృహ
సేవకు లయిరి.

ఇట్లు గృహసేవకులుగాఁదలఁచిన బాలురును, బాలికలును
దమవిధులయందేగాక మర్యాదలయందుఁగూడ శిక్షితులు గా
వలయును. వారు తమయజమానునితో నెంతటిచనవును గలిగి
యుండవలయునో యాతని కెంతదూరమున నుండవలయునో
యిట్టియంశములను నేర్చుకొనవలయును. జపానీయపరిచారిక
క్రిందికి వంగి యజమానురాలికి నమస్కరించి యామెతో నెప్పు
డునధికారితో మాటలాడుగౌరవముతో భాషించుచుండును,
గాని యజమానురాలింటికి వచ్చినచుట్టపక్కములతో మాటలా
డునప్పు డాసంభాషణలో సేవకురాలుగూడ గలిసిపరియాచక
ములుగూడఁ బల్కవచ్చును.

ఇట్టిస్థితిలోఁ బరిచారికలకు మితిమీరిన స్వాతంత్ర్యము చిక్కెనని తోఁచునుగాని వారెప్పుడు నట్టిస్వాతంత్ర్యతను దీసికొనరు. వారి కట్టుబాటులును జక్కనిశిక్షయు నెంతవఱకుఁ దాముచనవుగలిగియుండవచ్చునో యామితి నెన్నఁడును మీఱరు. తమయజమానులు తమ్ము సేవకులను బిలిచినట్లు పిలిచినను వారింటికివచ్చెడు నతిథులు బంధువులును మాత్రమీసేవకులను దమతో సమానగౌరవ మిచ్చి మీరుమీరని బహువచనములో మన్నించి మాట్లాడవలెనన్న నియమమునుబట్టి యీసేవకులస్థితి మనకుఁ దెలియవచ్చును. యజమానురాలింటలేనప్పుడు పరిచారికలే యింటికి వచ్చినవారి నాదరించవలెను. దీనిని వారు చక్కనిపద్ధతులప్రకారము మర్యాద తప్పకుండఁ జేయుదురు.

ఒకదొరసాని యిట్లు వ్రాయుచున్నది. "నేనొకప్పుడు చాలదినములు సముద్రముమీఁదఁ బ్రయాణముచేసి యొకభాగ్యవంతుఁడయినజపానీయునియింట బసకు దిగితిని. వారిభాషలో నొకమాటయైన నాకుఁ దెలియనిదాన నగుట నాయింటియందు మాకు స్వాగతమొసంగినయాబిడకును నన్నటకుఁ గొనిపోయిన నామిత్రమునకును జరిగినసంభాషణ మేమియు నాకు బోధపడలేదు. ఆమె బూడిదరంగు 'కిమోనో'యును, నడిమింవయునుపా



రుధరించు 'ఓబీ' యును ధరించినది. ఆమె నాకొరించినమర్యాదయు, నాదరణము నేను దొడుగుకొన్నబూట్సువలెనే నాకతిభారముగాఁ దోఁచినది. నేనాబూట్సు విడుచుట కామె యంగీకరించినదికాదు. ఆమె మెత్తనితెల్లమేజోడుతోఁ బోల్చిచూడఁగా నాబూట్సు చాపలమీఁద టక్కుటిక్కుమని చప్పుడగుచుండెను.

''నాచెలియామెను మీరని మన్నించుచునతిథి యింటియజమానితో మాట్లాడునట్లు మాట్లాడుచుండెను. మేము క్రిందఁగూరుచుండి తేనీళ్లు పుచ్చుకొంటిమి. నాసఖి యామెతో ముచ్చటించుచుండెను. ఇట్లుండగా వీధిలో బండిచప్పుడు వినఁబడెను. తోడనే క్రిందఁబల్లచప్టాచేయఁబడినమార్గముమీఁద నడుగులచప్పుడు వినవచ్చెను. వారిని జూచినతోడనే "ఓకెయిం ఓకెయిరి,, యనుసంతోషవచనములు వినవచ్చెను. దీనికి "ఘనులు దయచేసిరి" అని యర్థము. మాకుసత్కారముచేసినయిల్లాలు వారింజూచి సవినయముగ లేచి చిరునగవొప్పఁ దాఁజేసిన మోటుమర్యాదకు మన్నింపుఁడని మమ్ము వేఁడుకొని వచ్చినవారికి స్వాగత మొసంగుటకు వారికడ కేగినతోడనే నాయనుఁగు "ఆమెవచ్చినందులకు సంతోషించుచున్నా" ననెను. "ఎవరు వచ్చిర''ని నేనడిగితిని. 'మనముచూడవచ్చినామె' యని యా

మో చెప్పెను. అట్లయిన నీతవఱకు మర్యాదలు జేసినసాధ్వి యెవ్వరంటిని. దానికి నాస్నేహితురాలు నవ్వి యామెపరిచారిక యనిచెప్పెను.

ఈవిషయమునుగూర్చియే యింకొకరిట్లు వ్రాయుచున్నారు. జపానీయులలోని పెద్దసేవకులు మంచిమర్యాద కలవారై యుండవలెను. ఎందుచేత ననఁగాఁ దమయజమానులింట లేనప్పు డింటికి వచ్చినయతిథులకుఁ గౌరవసత్కారములు చేయుట వారికి విధి. వారువచ్చినయతిథులకుఁ దమమోకాళ్లు నలుపుకొనుచు నమస్కరించి యతిథులను లోనికిఁ గొనిపోయి యాసీనులం జేసి మైదాకుగిన్నెల తేనీళ్లిచ్చి వారికడఁ దమయజమాని వచ్చువఱకు నుచితవినయముతోఁ ముచ్చటించుచుఁ గూరుచుందురు. యజమాని వచ్చినతరువాత గూడ వారుండియతిథులకును గృహస్థులకును జరుగుసంభాషణలోఁ దాముగూడఁ బ్రవేశించి హాస్యసందర్భమునఁ దప్పక నవ్వుచుందురు.

[ఈగృహసేవకులు మనదేశమునం దుత్తములయినవంటబ్రాహ్మణులు వంటలక్కలు మున్నగువారితోఁ బోల్పఁదగియున్నారు. కాని మనదేశమున వీరిస్థితి చాలభాగము చెడినది]

---



## తొమ్మిదవప్రకరణము.

—:o:—

### దినచర్య (శేషము)

ఇప్పుడు భర్తను వ్యాపారమునకుఁ బంపి వచ్చినభార్యనుగూర్చినతరువాయి చెప్పుకొందము. అట్లు విభుఁడేగినపిమ్మటఁ దాను కాగితపుదెఱల నన్నింటిని దీసివేయును. అప్పుడాయిల్లంతయు నొకపెద్దగదియయి యందులోనికి గాలి పూర్తిగా వచ్చును. పఱుపు లన్నియుఁ దీసివేసి యలమారులోఁ బడవేసికఱ్ఱసామానును దుడిచివేయును. గిన్నెలలోనున్న నిన్నటిపువ్వు లన్నియు వాడియుండును గనుక క్రొత్తపువ్వులను గొనితెచ్చి వానియందు మరలఁ జక్కగా నమర్చుటామెకొక పెద్దపని.

వారియింట వంటచేయుట యైరోపాదేశీయులలోవలె నంతకష్టమయినపని కాదు. బియ్యము, తేయాకు, ఊరుగాయ, కూరలు నివి సిద్ధముగా నున్నయెడలఁ జాలును. యూరోపీయనులు రొట్టెను దినునట్లు జపానీయులు బీదలును భాగ్యవంతులునుగూడ నన్నమును తిందురు. ఆయన్నము మిక్కిలిమృదువయి పరిశుభ్రముగానుండి మెఱయుచుండు పళ్లెములతో వేఁడిచల్లారకుండ నందఱకును వడ్డింపఁబడును. ఎంతసామాన్యమయినభోజనమయినను సొగసుగా వడ్డింపఁబడును. ఆయన్నముతో నూరుగాయలు

పచ్చళ్లు మొదలగు ననేకరుచ్యపదార్థములు వారు భుజింతురు. భోజనము యువారినడుమ నొక (హిబాచీ) పొయ్యిమీఁద తేనీళ్లు కాఁగుచుండును.

జపానుగృహిణి సంతకుఁ బోయినపుడు బియ్యపుదుకాణము, చేఁపలయంగడి కూరలమ్మెచోటు నివి యామెకు ముఖ్యములు. [మన దేశమందలి శూద్రజాతిలో ననాగరికులయందీయాచారము కలదు.] చేఁపలయంగడికడ సముద్రముమీఁద వచ్చినదెద్దియు నుపేక్షింపఁబడదు. అక్కడ చేఁపలనేగాక యింక ననేకవిధములయిన జలచరములను వారు విలుతురు. (Sea weed) సీవీ అనునది వారికి సాధారణమైన భోజనపదార్థము. దానిని పచ్చిదిగానే తిందురు. ఉడకబెట్టుకొనియు నూరుగాయ పెట్టుకొనియు వేయించుకొనియుఁగూడ భుజింతురు. దానితో వారు పులుసు చేసుకొందురు. యూరోపియనులు వ్యర్థములని విడిచిపెట్టుజలచరములరకములను గొన్నింటిని వారాసక్తితో భుజింతురు.

కూరలదుకాణముమీఁదఁ జిక్కుడుకాయలు బటానీలు బంగాళాదుంపలు జొన్నలు కర్బూజపండ్లు దోసకాయలు వెల్లుల్లి నీరుల్లి మిరపకాయలు మొదలగు ననేకవస్తువులుండును. జపానుదేశస్థులు భూమిమీఁదఁ బెరుఁగు ప్రతివస్తువును తిందురు.



అల్లము వెదురుమొవ్వు వీనినిగూడ సంతోషముతో భుజింతురు.

కాని, జపానీయులకూరగాయలు యూరోపియనుల కేమియు రుచింపవు. వారిలో ముఖ్యమయిన 'డైకోను' అను నొకవిధమయిన వేరు పాశ్చాత్యులకు బొత్తిగాగిట్టదు. అప్పటిపెద్దవారలకెల్ల నిది మిగులరుచ్యమయినపదార్థము. పరదేశీయులకిది కడువెగటు. ఇది మిక్కిలి పెద్దదిగా నెదిగియొక్కొక్కటి యొకగజముపొడుగును, మనుష్యునిభుజమంతటిలావును గలిగియుండును. క్రొత్తది జబ్బుచేయదు. కాని దానినిజపానీయు లూరుగాయఁ బెట్టుకొందురు. 'అది కొంచె మెండనిచ్చి యుప్పులో నూరవేయుదురు. తరువాత మూఁడుమాసము లట్లుండనిచ్చెదరు. ఆకాలములో నది చాలరసమును బీల్చుకొనును. అప్పుడు దానికెక్కడలేనిదుర్వాసనయును గలిగి యది భుజించుచుండ నింటనుండుటకూడ మిక్కిలి కష్టముగా నుండును. అంతటిదుర్వాసనగలవస్తువింకెద్దియు నేనెఱుంగను.' అని మిసెస్ బిషప్పను నామె వ్రాయుచున్నది.

తరువాతి నూరుగాయదుకాణము ప్రధానమయినది. జపానీయులు తమరుచిలేనిభోజనముతో ననేకరకములయూరుగాయలను పచ్చళ్లను వినియోగించుకొందురు. అందుఁ బ్రధానమయి

నది "పోఖు" యనునది. దానిని బుడిసినగోదుమపిండితోడను జిక్కుడుకాయలతోడను జేసి యందు రుచికలుగుటకై యొక వ్విధు 'సాకె', యనుమధువునుగూడఁ బోయుదురు. ఇది యనేక పదార్థములతోఁ గలుపుకొందురు. తరుచు చేఁపల నందులోను దక బెట్టుదురు.

ఇట్లు సంతపనిఁ జేసికొని యజమానురాలు వచ్చునప్పటికిఁ బరిచారికలు దమపనులను జేసి సిద్ధముగ నుండవలెను. జపానీయులయిండ్లలోఁ బరిచారికలు చేయవలసినపను లేవి యుండు నని యూరోపియనువనితలకు సంశయము గలుగును. పొయ్యి వెలిఁగింపనక్కఱ లేదు. పరిశుభ్రపఱచవలసిన కత్తిసామాను లేదు. తుడుచుటకుఁ దివాసులు లేవు. కడిగి బాగుచేయుటకు నారగుడ్డ లేదు. (Linen) కాఁబట్టి జపానుపరిచారికలు మాటలు చెప్పుకొనుటయందును జతురంగ మాడుటయందును గ్రొత్తకిమోనోలు గట్టుటయందును దమకాలమును వినియోగించెదరు. విధిగా పనులకుఁ గావలసినవారికంటె నెక్కువమందిపరిచారిక లుందురు. దీనికిఁ గారణము వారు చవుకగా దొరకుటయే. అన్నవస్త్రముల నిచ్చినఁ గావలసినంతమందిబాలికలు పరిచర్యకుఁ గుదురుదురు. పెద్దవానికిని 7—8 షిల్లింగులకంటె ననగా ౫—౬ రూపాయలకంటె నెక్కువజీత మక్కఱలేదు.



ఎవరైన నొకనౌకరు తనపనిని మానుకొనునప్పుడు తన యజమానితో నట్లు స్పష్టముగఁ జెప్పడు. అట్లుచెప్పుట మోటుతనముగ నెంచఁబడును. అందుకుబదులుగాఁ దనయింటికిఁ బోయి చూచివచ్చెదననియో జబ్బుగా నున్న చుట్టములను జూచి వచ్చెద ననియో సెలవు పుచ్చుకొని వెళ్ళును. పిమ్మట తిరిగి రావలసినదినమునాఁటికిఁ దానట్లురాలేకపోవుటకు పెద్దక్షమాపణను బంపును. దీనికర్థము దానునౌకరీని మానుకొంటి ననుట.

ఇట్లే యజమానురాలును నౌకరును మానుకొనుమని చెప్పదు. నీపరిచర్య నంగీకరించుటకుఁ బ్రస్తుతము వీలు లేకున్నదని యొవరిచేతనో మర్యాదగాఁ జెప్పించును. సాయంకాలమునఁ గుటుంబమందఱు పరిచారికలతోఁ గూడ పెద్దగదిలోఁ జేరుదురు. యజమానియు యజమానురాలును బ్రొయ్యికడఁ గూరుచుందురు. పరిచారికలు కుట్టుకుట్టుకొనుచుఁ గాని, యేమైన కబురులు చెప్పుకొనుచుఁ గాని, కొంచెము దూరముగాఁ గూరుచుందురు. అప్పు డందఱుగలిసి లోకాభిరామాయణము చెప్పుకొనుట గాని, లేదా యజమాని యేదేనికథలపుస్తకము చదువుకొనుట గాని, జరుగును. హాస్యము వచ్చినపుడు పరిచారికలుగూడ స్వేచ్ఛగా నవ్వుచుభాషింతురు.

పండుకొనవలసినసమయము కాఁగానే యలమారులలో నుండి బొంతలను దీసి తల యుత్తరపువైపున కుండకుండఁబఱచెదరు. చచ్చినవారితల నుత్తరపువైపున కుంచుదురు. కావున నట్లు పండుకొనుట దురదృష్టముగా నెంచఁబడును. తరువాత కొయ్యతెక్కెములను బెట్టుకొని ప్రతివారును నిద్రింపఁబోవుదురు. ఇట్లు దినచర్య యంతమగును.

## పదియవప్రకరణము.



### ఆటలు.

జపానుదేశమునందు పిల్లల కనేకవిధములయినయాటలు గలవు. అందుఁగొన్నిఁటియందు పిల్లలేగాక తల్లిదండ్రులును తాతయవ్వలును గూడ పాలు పుచ్చుకొందురు. తాతగారు దన మనుమనితోపాటు తానుకూడ నుత్సాహముతోఁ గాలిపడగ నెగరవేయును. బాలికలు బాతులు బొంగరముల నాడుదురు. బొంగరములాట యిట్లుండును. ముందొకబాలుఁడు తనబొంగరమునకుఁ ద్రాడును జుట్టి నేలపైఁ ద్రిప్పును. అది గిరగిర దిరుగుచుండ రెండవవాఁడు తనబొంగరమును దానికిఁ దగిలి దానిం గొట్టునట్లు వేయును. ఈరెండవదానిదెబ్బ తగిలి మొదటిబొంగరము కొన్ని యడుగులదూరము పోవును. మిడుతలను బట్టుకొని వెదురుపంజరములందు బెట్టుట, మిణుగురుపురుగులను బట్టుకొనుట మొదలగునవి తక్కినయాటలు. ఇందుఁ గడపటి దన్నివయస్సులవారి కానందకరమయినది. రాత్రులందు మెరయుచున్న పురుగులను వెంబడించి తేలికయయిన విసనకఱ్ఱలతోఁ బట్టుకొందురు.



ఎక్కడనైనఁ జిన్నసీటికాలువలు గాన్పించినయెడల బాలురు వానియందుఁ జిన్నచిన్నసీటిచక్రము లమర్చినయంత్రములను నేర్పుతోఁ జేసి నడిపించెదరు.

ఇచ్చటఁ బలువురు గుమిగూడి యేదో చూచుచున్నారు. వారిబుజములమీఁదనుండి వారుచేయునది యేమో చూచుదము. ఆహా! ఇదియొకటక్కరి. ఒకపిల్లవాఁ డొకయరడజను పేడపురుగులను బట్టుకొని వానిచేత బియ్యపుగింజలను గొన్నిఁటి నొక యేటవాలుగానున్న దిబ్బమీఁదికిఁ దోలుచున్నాఁడు. అతఁడు కాగితముతోఁ జిన్నబండి నొకదానిఁ జేసి దానిలో బియ్యము పోసినాఁడు. దానికి సన్ననిపట్టుదారములు గట్టి వాని నీపురుగులకుఁ జిగురుతో నంటించినాఁడు.

ఇప్పు డాతనిబండి సిద్ధమయినది. ఆపురుగులు బల్లపైకి బండి నీడ్చుకొని నడుచుచున్నవి. అచటిబాలురు ఱెప్పవాల్పక దాని నత్యాసక్తితోఁ జూచుచున్నారు. ఒక్కఁడును వ్రేలుజూపనైనఁ జూపఁడు. ముట్టకుఁడని యెవ్వరును జెప్పనక్కఱలేదు. అట్లెవ్వరును దాఁకరు. అదిమోటుతనమని వారెఱుంగుదురు. జపానుపిల్లలు పెద్దవారలసాయ మపేక్షింపకయే తమ యాటలను దాము జక్కఁబెట్టుకొందురు. వారిలోఁ దరచు కలహములు కలుగనేకలుగవు. ఒకవేళ కలిగినను నొకపెద్దపిల్లవాఁడు చెప్పినచొప్పున నందఱునువిందురు. ఆతఁడు చెప్పినతీర్పునకొక్కరును మాఱుపలుకక విధేయులగుదురు. ఆట మునుపటివలె సాగిపోవును.

దారిప్రక్క నిసుకతో బొమ్మలు వ్రాయుటవారి కింకొక ప్రీతికరమయినయాట. కొందఱుబాలురు గూడి పంతములు వేసికొని బొమ్మలను వ్రాయుదురు. ప్రతివానికిని నలుపు, యెఱుపు, పసుపు, నీలము, ననునాలుగురంగులయినుకసంచులు నాలుగును నొకతెల్లయినుకసంచియు నుండును. మొదటఁ దెల్లయినుక చతురముగా పఱచెదరు. తరువాత గుప్పెడునల్లయినుక దీసికొని వ్రేళ్లనడుమనుండి యినుక జార్చి వ్రాయఁదలఁచుకొన్నబొమ్మయొక్క వెలుపలిరేఖను గీయుదురు. తరువాతఁ దక్కినరంగులతో బొమ్మను పూర్తిచేయుదురు. ఇట్టిబాలశిల్పులు మిక్కిలి



చక్కని ప్రావీణ్యమును గనఁబఱచెదరు. కాని, వీరిలోఁ బ్రముఖుఁడైనవాఁడు చేసెడుపనిని జూడ నతివినోదముగా నుండును. అతఁడు దనచేతిని మొదట నీలపుటినుకసంచిలోను దరువాతఁ బసుపుసంచిలోనుముంచి వాని నొకదానితోనొకటి గలియకుండ, వేఱువేఱుగీతలు పడునట్లు వ్రేళ్లలోనుండి జారనిచ్చును. తరువాత చేతిని గొంచెము వణఁకించి యాకుపచ్చనిగీతలు పడునట్లు రాల్చును. మఱల నీరెంటిని నిమిషములో విడఁదీసి వేఱువేఱుగీతలు పడునట్లు చేయును.

ఇదిగాక యిండ్లలో నాడుకొనునాట లనేకములు గలవు. వానిలో వారికి మిక్కిలి యిష్టమైనది. 'లిపిపేక' యాట. ఇది కొన్ని పేకముక్కలతో నాడఁబడును. అందుఁ గొన్నిఁటిమీఁద సామెతలును, గొన్నిఁటిమీఁద నాసామెతలకు దృష్టాంతములయినబొమ్మలు నుండును. బాలు రందఱు చుట్టును గూరుచుండి పేకముక్కలను బంచుకొందురు. వారిలో నొకఁడుచదువుచుండును. అతఁడొకసామెతనుజదువగానే దానికి సంబంధించిన బొమ్మఁగలవాఁడు పలికి యాముక్క నిచ్చివేయును. ఇట్లెవరి ముక్కలు ముందయిపోవునో వాఁడు గెల్చును. చివరవఱకు నెవరిముక్కలుండునో వాఁడోడును. ఓడిపోయినవాని మొగముమీఁద సిరాగాని మఱియేదైనరంగుగాని పులుముదురు. అట్లో

డినది బాలికయైనయెడల నామెజుట్టులో నొకగడ్డిపరక నుంచు
దురు. ప్రతిసామెతయు జపానుభాషయొక్క యక్షరమాలలో
నేదేని యొకయక్షరముతోఁ బ్రారంభమగుటచే నీయాటకు
లిపిపేక, యని పేరువచ్చినది.

జపానుపిల్లల కనేకపండుగలు నుత్సవములును గలవు.
ఆసంతోషసమయములయందు వారు చాల యానందింతురు.
వింతరంగుల పట్టుబట్టలను గట్టి సూర్యరశ్మి కవి మెరయుచుం
డఁగా వారందఱు పువ్వులతోఁటవలె గనిపించుదురు. మొంపెస్
అను నొకఁడు తాఁజూచినయొకపండుగ నిట్లు వర్ణించుచున్నాఁడు.
ఇదిపదియేండ్లలోపుబాలికలపండుగ. వారనేకవందలమంది తమ
కిమోనోలను పైకిఁ గట్టుకొని లోపలిదొక్కాలు గనుపడుచు
పూలవాటికవలెఁ గనఁబడుచుండిరి. వారందఱు రెండువరుసల
గాఁ దీరి యొకవరుస కొకవరుస కొన్నిగజములదూరమున ని
ల్చిరి. వీరినడుమ నిద్దఱుపరిచారికలు చేతులలోఁ జేరి యొక వెదు
రుకఱ్ఱను బట్టుకొని నిలిచిరి. ఆకఱ్ఱలకుఁ జివర నొకకాగితముతోఁ
జేయఁబడినమద్దెల గట్టఁబడియుండును.

వెంటనే యిద్దఱుపాధ్యాయులు వచ్చి యనేకరంగులు
గల బంతులున్నబుట్టలను దెచ్చి యాపిల్లలకును మద్దెలలకును
నడుమ పచ్చికమీఁద బోయుదురు, తరువాత నొకసంజ్ఞచేయబ



డును. తోడనే బాలిక లందఱు నతివేగమున నొకరిమీఁద
నొకరు పడుచుఁ బరుగులెత్తి బంతులను బట్టుకొని మద్దెలల
పైకి విసరుదురు.

కొంతసేపైనతరువాత నీబంతులు దగిలి మద్దెలలు జరిగి
పోయినతరువాత రంగుకాగితములు, చిన్నచిన్నలాంతరులు, కా
గితపుగొడుగులు, జండాలు లోనగునవి యాబాలికలతలలమీఁది
ను జేతులలోను బడును. ప్రకాశమానమయిన దుస్తులను ధరించి
బాలికలందఱు గూడి పూలగుత్తులవలె మెరయుచుఁ దలలఁ
పైకెత్తి యాటవస్తువులకొఱకు నిరీక్షించుచుండుటకంటెఁ
జక్కనిముచ్చట నేనెన్నఁడుఁ జూచియుండలేదు.

—

## పదునొకండవప్రకరణము.

### బొమ్మలపండుగ—జెండాలపండుగ.

మూఁడవమాసము మూఁడవదినమునఁ బ్రతిజపానీయుని
యింటియందును గొప్పయుత్సాహముతో నుందురు. వారు
బాలికలను దమయింటిభాగ్యముగ నెంచుకొనుచుందురు. ఈది
నమున బొమ్మలపండుగ ప్రారంభమగును. నాఁడు ధనాగా

రమునుండి (కొట్టు) మిక్కిలియందమయినబొమ్మలను బొమ్మరిండ్లనుబట్టుకొని వత్తురు. వాని నన్నింటిని దెచ్చి యలమారు మీఁద నొకయెఱ్ఱనిగుడ్డ పఱచి దానిమీఁద వీని నన్నింటిని బెట్టుచురు.

ఇవి ‘యొహీనా’, యని పిలువఁబడు గొప్పబొమ్మలు. వీని నెంతో జాగ్రతతోఁ గాపాడుచుందురు. కొన్నికుటుంబములలో వందయేండ్లనాఁటిబొమ్మ లుండును. బొమ్మ యేకాలము నాఁటిదో దానికాకాలపురీతి బట్టలు గట్టి యందులకనుగుణములయినసరకులతో నలంకరింతురుగావున నీబొమ్మలకుఁ జారిత్రక[illegible]యినవిలువ కలిగియుండి బాలురకుఁ దమపూర్వు లెట్లుండెడి[illegible] బోధింప వినియోగించును.

ఈగొప్పబొమ్మలు గాక సామాన్యపుబొమ్మలు ప్రతిదినము బాలికలాడుకొనునవి కొన్నిగలవు. కాని యాగొప్పబొమ్మలనుమాత్ర మతిజాగ్రతతో దాఁచి యుంచుదురు. వానిలోఁ గొన్ని మిక్కిలి వెలగలిగియుండును. బొమ్మమిక్కిలి యందముగా నుండి చక్కనిబట్టలు గట్టఁబడుటయే గాక దానియిల్లును అందలిసామాను నాకాలపువానితో సరిగఁ బోలియుండును. భాగ్యవంతుల యిండ్లలో నీబొమ్మలసామా నరుదుగ దొరకుబంగారులక్కతోఁగాని వెండితోఁగాని యందమయిన పింగానితోఁగాని



చేయఁబడును. వైభవము దెల్పునట్టిగాని యుపయోగమయినట్టిగాని యొకవస్తువునైనను లోటు రానీయరు. జపానుబాలికకుఁ దనబొమ్మవస్తువులతో బండుగరోజులలో నన్నము వండి గొప్పబొమ్మలకు ముందు నివేదించి యందఱకు విందుసేయుట యెంతో కుతూహలము.

బాలిక పుట్టఁగానే బొమ్మలను సంపాదించుటకుఁ బ్రారంభింతురు. ప్రతియాఁడుబిడ్డకు నొకజోడుబొమ్మలను బహుమానమిత్తురు. కాలక్రమమున నాబాలిక యాబొమ్మలకుఁ గావలసినపరికరము లన్నియు సంపాదించుకొనును. ఈబొమ్మ లెప్పుడు నాబాలికయొక్క సొత్తయియుండును. పెండ్లియయినతరువాత నాబొమ్మల నామె తనతోఁ గొంపోవును.

ఈబొమ్మలపండుగ సమీపింపఁగానే దుకాణము లన్నియు నప్పటికిఁ గావలసినవస్తువులతో నిండుచుండును. అందు చౌకబొమ్మలు మట్టివి. అంతకన్న నెక్కువవి కఱ్ఱవి;గానుండి విలువయైన దుస్తులతో నలంకరింపఁబడును. ఈబొమ్మలును గిన్నెలు, ప్రొయ్యిలు, చత్రములు, పాత్రలు, మున్నగువానితో బొమ్మలపండుగ యలంకరింపఁబడును. వానివిలువ యనేకవిధములుగ నుండును. కూలివాండ్రు కొనగువారికిఁ గొన్ని పెన్నులకే దొరకును. గొప్పవారికిఁ గావలసినవి విస్తారముఖరీదు గలిగియుండును. అందుఁ జక్కగా నగిషీచెక్కినవియు, నలంకరింపఁబ

డినవియుఁ జక్రవర్తి చక్రవర్తినులయొక్కయు, వారియాస్థానో
ద్యోగులయొక్కయు, బొమ్మలును అచ్చట నుంచవలసిన యన్ని
వస్తువుల ప్రతిమలు నుండును. తక్కినబొమ్మలు జపానునందలి గొ
ప్పగొప్పవారి ప్రతిమలయి యుండును. ఒక డైమియోయును వాని
పరిజనంబును దెల్పు ప్రతిమలయియుండి వారివారికుచితమయిన
యుడుపులతోడను అలంకారములతోడను జిత్రింపఁబడియుం
డును.

ఇఁక బాలురకు పెద్దపండుగ జెండాలపండుగ. ఇది యై
దవనెల యైదవదినమున వచ్చును. ఇది సమీపించుచున్న దని
యందఱకుఁ దెలియును. అది సమీపించినపుడు బాలురున్న
ప్రతియింటిముందు నొకపొడుగయినవెదురుకఱ్ఱను బాతిపెట్టుదు
రు. దానిచివర రంగుకాగితములతోఁ జేయఁబడినయొకచేపను
వ్రేలాడఁగట్టుదురు. ఆసంవత్సర మాయింటియం దొకమగశిశు
వు జన్మించినయెడల నాచేఁప మిక్కిలిపెద్దదిగాఁ జేయఁబడును.
ఆచేఁపగర్భము గుల్లగా నుండును. అందుచేగాలివీచినపు డది
నిండి ఱెక్కలతోడను తోఁకతోడను నీదుచున్నట్లు కనిపించు
ను. చేఁప నీటి కెదురుగా నెక్కివేగముగా నీదగలదు కనుకను,
జలపతనములను(Water falls) దాఁటిపోఁగలదు గనుకను వారిచేఁ
పను గట్టుటకుఁ గారణము. ఈచేఁపలవలెనే బాలురు సంసారప్ర



వాహము నీది కష్టములను జయప్రదముగాఁ దాఁటఁగల రనుట
కిదిగుఱుతుగా భావింపఁబడును.

ఇట్లు బాలురపండుగ వచ్చుసరికి దుకాణములు వారికిఁ
గావలసినబొమ్మలతో నిండియుండును. బాలురకును వారిసోద
రీజనంబులకును వలసినప్రతిమలు గలవు. అందు బాలురకుఁ
గావలసినవి యుద్ధభటులు, శూరులు, సేనానాయకులు, ప్రసిద్ధి
కెక్కినపూర్వపుయోధులు, మల్లులు, మొదలగువారిప్రతిమలు
పూర్వపుజపానీయులు యుద్ధప్రియులు. అందుచేత వారిపిల్లలకు
జెండాలు, కవచములు, శిరస్త్రాణంబులు, కత్తులు, విండ్లు, అమ్ము
లు, బల్లెములు, మొదలగుబొమ్మల నిత్తురు. ఈజెండాలపండుగ
వారియుద్ధదేవతయగు "హాకీమాఁ"నకుఁ బ్రియమయిన దినమున
జరుపఁబడును. నాఁడు వారికిఁ బ్రియమయినయాట ఖేలనాసం
గరము.

బాలురు రెండు తెగలుగా విభజింపఁబడుదురు. అందొక
తెగవారు "హెయికె" యనియు, రెండవతెగవారు "జెంజి"యు
నియుఁ బిలువఁబడుదురు. ఈరెండుపేళ్లును పూర్వపుసామంతరా
జులలోని కక్షలపేళ్లు "హెయికె" తెగవారిలోఁ బ్రతివాఁడు నొ
కయెఱ్ఱజెండాయును, "జెంజి" తెగవాఁడు తెల్లజెండాయును బట్టు
కొనును. ప్రతిసైనికుఁడు నొకశిరస్త్రాణమును ధరించును. దాని

యందొకమంటికుండ యుండును. తరువాతయుద్ధము ప్రారంభ
మయి యిరువాగులవారును వెదురుకత్తులతో నొకరినొకరుతల
పడుదురు. అందు సూటిగాఁ జూచికొట్టినవాని దెబ్బకుఁ బ్రతి
వీరునినెత్తిమీఁదనున్నకుండ పగులును. దానితో నాతఁ డోడి
పోయిన ట్లొప్పుకొనవలయును. ఏకతమువారు తమవైరులయొ
క్కకుండల నెక్కువగఁ బగులఁగొట్టుటగాని యెక్కువజెండాలను
బట్టుకొనుటఁగాని జరిగింతురో వారుజయించుదురు.

ఈప్రకారము కొమ్ములూదుటయు, నాయుధములను
గనఁబఱచుటయు, నింకొకందులకుఁగూడ వినియోగించుచున్నది.
ఈమైదవమాస మైదవదినమున 'ఓనై' యను నొకదుర్దేవతపై
నుండి దిగి బాలురను జంపి తినుననియు, లేదా వారికి గొప్పహా
నినైనఁ గలుగఁజేయుననియు వారు నమ్ముదురు. ఆదేవతకుఁ గ
త్తులనిన భయము. కనుక నదుల ప్రక్కలను పల్లపువరిపొలముల
ప్రక్కలను బెఱుగు కత్తులవంటియొకవిధమయిన చెట్లయాకులను
దెచ్చి వానితో నిండ్ల కలంకారములు సేయుదురు. ఒకజపా
నీయగ్రంథకర్త యిట్లు వ్రాయుచున్నాఁడు. 'ఓనీ'కి మధురకేత
నముల (Sweet flag) కత్తివాయియనిన భయము. గనుక నె
చటఁ జూచినను దానియాకులే కనిపించుచుండును. ఇంటిచుట్టుఁ
ను వానితోఁ దోరణములు గట్టుదురు. వానినిజూరులనిండ గ్రు



చ్చుదురు. బాలురు వానినిఁ దలకుఁ జుట్టుకొందురు. పరిమళము
గల తెల్లనివేరులు రెండుకొమ్ములవలెఁ గట్టుకొందురు. ఇట్లు
జెండాలతోడను వెదురుబూరాలూదుటచేతను, ఆపిశాచమును
బారఁదోలుదురు. ఆపిశాచమునకుఁ గొమ్ములున్న మనుష్యులను
జూచినను, కత్తులున్నయిండ్లను జూచినను భయము. [ఈజెండాల
పండుగయును బొమ్మలపండుగయును గొంతవఱకు మనదసరా
పండుగతో సరివచ్చునవిగా నున్నవి. కాని, యంతరభేదములు
చాల నున్నవి.]

---

## పండ్రెండవ ప్రకరణము.

:o:

### ఒకడబ్బుతో తీర్థమేగుట.

ఒకడబ్బు చేతఁ బుచ్చుకొని నీయిష్టమువచ్చినట్లు విచ్చ
లవిడిగా వ్యయపఱచుకొనవలయు ననిన నీకెట్లుండును? నీకీమా
ట హాస్యాస్పదముగఁ దోఁచును. "అబ్బా! ఒకడబ్బా? ఏమిచే
సికొనను?" అని నీవు చెప్పుదువు. ఒకపావులా గాని యర్థ
రూపాయగాని యున్నను జాలదు. ఒకడబ్బెందులకు వచ్చును?
అని నీవందువు కాని జపానులో దానితోఁ జాలపనులు చేయ

వచ్చును. ఆదేశమున కూలి యత్యల్పము. అక్కడ దినమున కాఅణాలకంటె నెక్కువకూలి దొరకదు. పన్నెండణాలు రోజునకు దొరకినవాఁడు భాగ్యశాలి. (ఈకూలి యింగ్లీషువారికి హీనమైనకూలిగాఁ గాన్పించునుగాని పేదవడియున్న మనదేశమున నెక్కువకూలియే.) సంపాదన తక్కువగనుక ఖర్చుకూడ నందులకుఁ దగినట్లుండును. నాగసాకిలో నొకనంతెకు ఓహారాయను బాలికయు నామెసోదరుఁడు టారోయును దీర్థమునకుఁ బోయి యేమిచేసిరో చూతము. ఆనాఁటియుదయమున వారు చిరకాలమునుండి నిరీక్షించుచున్నతీర్థము వచ్చిన దని యుల్లాసముతో వేకువనె మేల్కాంచిరి గాని యాంగ్లేయులపిల్లలవలె వారా యుత్సాహమును బైకి యుడావడిమూలమునఁ దెలియఁబఱపరైరి. వారినల్లనికన్నులు మునుపటికంటె నెక్కువగఁ బ్రకాశించినవి. అంతే.

తరువాత భోజనములు చేసి (అన్నమునోటఁ గొట్టుకొని) దేవాలయపరిసరమున జరుగుచున్నతీర్థమునకుఁ బోయిరి. వారు మంచియుడుపులను ధరించిరి. ఇద్దఱికిని గ్రొత్తకిమోనోలు గలవు. ఓహారాకు సొగసైనయోబీని తల్లిదండ్రు లెన్నోఖర్చులు మానుకొనికొట్టించిరి. వారితండ్రియును ముత్తవతల్లియునుగూడ వారితోఁజనిరి. తల్లిమాత్రము చంటిపిల్లతో నింటనుండెను. తండ్రి



గ్రొత్తగానుదికినకిమోనోను ధరించెను. ఆతనికివిశేష మేమనఁగా నొకయూరోపాదేశీయుఁడు బహుమానమిచ్చినటోపి యొకటి. అది యతనికి మిగులపెద్దదిగాని, యట్లు కాన్పింపకుండ ధరించి దానికాతఁడు మురియుచుండెను. తీర్థమునకుఁ బోయినతోడనే వారి హృదయములు పొంగిపోయెను. అక్కడఁ జూడఁదగినవియుఁ జేయదగినవియు, నెన్నో కానిపించెను. అక్కడకు వెళ్లఁగానే హారాటారోలకు మిఠాయియంగడిమీఁదికి దృష్టి వరుగెత్తెను.

ఇద్దఱికిఁ జెఱియొకయైదుచిన్నలును గలవు. (పీచిన్నలు=1ఫార్థింగు=1డబ్బు)అందొకచిన్నిచట ఖర్చుపడినది. ఆదుకాణము రెండుభాగములుగా నున్నది. అందొకదానియందు పానకము బుడ్లతో నమ్మఁబడుచుండెను. రెండవదానియందు వివిధములైన రంగులు వేయఁబడినపంచదార గలదు. సోదరిపానకమునకును సోదరుఁడు పంచదారకును బోయిరి. కాని సోదరుఁడు మొట్టమొదట ముల్లుబిళ్ళ (Discan·larrow) మీఁదఁ దన యదృష్టమును బరీక్షించుకొనఁగోరెను. ఒకబిళ్ళమీఁద ముల్లొకటి యమర్పఁబడియుండును. ఆముల్లు త్రిప్పివేసినమీఁదట నది మంచిచోట నాఁగినయెడల దానికొక పంచదారముక్క యెక్కువగానీయఁబడును. భాగ్యవశమున టారో కొకపెద్దముక్క యె

క్కువగా వచ్చినందున నాతఁడు సంతోషించి తనకుఁ దీర్ఘము
ప్రారంభమయినవేళ మంచిదని యెంచుకొనెను.

ఇట్లు పంచదార దిని పానకము ద్రాగినతరువాత వా
రు గారడివాండ్రను, నాటకులను, హస్తలాఘవము చేయువారిని,
చేతిపాముగున మెడఁ జాపఁగల స్త్రీలను, కన్నెమలవలకుఁ బెదవులఁ
జాచు పురుషులను, నింకననేకమాయలు చేయువారిని జూచు
చు నంగళ్ళన్నియుఁ దిరుగ నారంభించిరి. ఇవి చూచుట కొక
రిన్ను సుంకము నీయవలెను. వారు చివరకు గారడివానియాట
జూడ నిశ్చయించుకొనిరి. అతఁడు నోట నిప్పును గ్రక్కెను. ఒక
పెద్దకత్తిని మ్రింగివేసెను. చివర నొకసముద్రపుపామును గనఁబ
రచెను. అది "సీకీ" అనుజలచరముయొక్క చర్మముతోఁ జే
యఁబడినట్లు కనఁబడెను.

అదిచూచి వారు తీర్థమునకెల్లఁ బ్రధానమైన యొకచో
టికి వచ్చిరి. పొయ్యియొకటి దగ్గఱబెట్టుకొని యొకఁడుండును.
వానిచుట్టు పిల్లలు తేనెపట్టున నీగలుమూగినట్లు మూగియుం
దురు. అక్కడ నొకరిన్నిచ్చినయెడల నచ్చట నొక్క భక్ష్యమును
స్వయముగఁ జేసికొనవచ్చును. రెండుగంటలసేపు నీవక్కడ
నున్నను నాతఁ డూరకుండును. ఇచ్చట నప్పచ్చులను జేసికొను
టయు, నిప్పుతో నాటలాడుటయు, గూడఁ గలిసివచ్చును.



గనుక దానికడ కేగుట పిల్లలకుఁ జాలసంతోషముగా నుండును.
గనుక నచ్చటికి హోరా వెళ్ళకపోయినను టారో వెళ్లెననిన నబ్బు
రము లేదు. పిల్లలు పొయ్యిచుట్టు నాడుకొనుచుండఁగ నామె పె
ద్దదిగనుక వారిలోఁ జేరరాదనుకొనెను.

ఇట్లు టారో రొట్టికాల్చుకొనుచుండగ నామె తనమూఁ
డవరిన్ను వ్యయముచేసి బొమ్మలాట నొకదానిని జూచి వచ్చెను.
తరువాత వారిద్దఱును గలిసి పైకి వెళ్ళిరి. ఇద్దఱు చెరియొకరిన్నును
బెట్టి పంచదారపాకము బెట్టినచిక్కుడుగింజలను కొనిరి. ఇవి
తినుచుఁ దండ్రికొఱకును అవ్వకొఱకు నొకనాటకశాలకడ
వేచియుండిరి. అందఱమునక్కడఁ గలిసికొందమని వారు మొద
టనేర్పాటుచేసికొని యుండిరి. ఈనాటకము చూచుటకుఁ
బెద్దలును, చిన్నలును, స్త్రీలును, బురుషులును, బాలురును,
పసిపిల్లలు నెందఱో తండోపతండములుగాఁ బోవుచుండిరి. ఏల
యన నచట నొకచారిత్రకమయిననాటక మాడుచుండిరి. అది
త్వరలోఁ బ్రారంభమగును. ఇచ్చటికి వారితండ్రి వచ్చి లోప
లకుఁ బోవుటకుగా నొకరిన్ను దీసెను.

లోపలఁ బ్రవేశించి యుచితస్థానముల నాసీనులయిరి.
ఆశాలయందలి ప్రదేశమంతయు నొకయడుగెత్తునఁ జిన్నచిన్నయఱ
లుగా విభాగింపఁబడి యుండెను. అందొకయఱలో వీరు ప్రవే

శించి క్రీడఁ గూరుచుండిరి. అక్కడ నవ్వ తాఁ దెచ్చినమూటను విప్పనారంభించెను. ఈమూటలోఁ గొన్ని భోజనపాత్రలును, గావలసినంతయన్నమును, గలవు. అచ్చటఁ గొంతసేపుండి యన్నపానములను సేవించి యాటఁ జూచి యానందించెదరు.

తరువాత తండ్రి పొగాకుగొట్టమును వెలిగించి కాల్చనారంభించెను. ఇక్లేయనేకవందలమంది పొగఁ ద్రాగుచుండిరి. ఒక్కొక్కయఱలో నొక్కొక్కకుటుంబము గూరుచుండును. వారందఱును వంటగిన్నెలను, అన్నమును, పానమును దెచ్చుకొందురు. తరువాత చుట్టలు, గొట్టములు, తినుబండారపుసరకులు, సాకేమనుసారాయియు మొదలగువాని ననేకు లమ్ముచుందురు.

ఆట ప్రారంభమయినతోడనే యందఱు నతిశ్రద్ధాళువులగుదురు. అది యొకపూర్వచరిత్రమును దెలుపు నాటకము. దానిం జూచుటకుపిల్లలనుగూడఁ దీసికొని జపానీయు లందఱు వోవుదురు. పిల్లలు చరిత్రము నిట్లు తెలిసికొందురు. పూర్వపుయుద్ధములు, పూర్వపుకలహములు, దైమియోలకు జరుగుపరస్పరయుద్ధములు, వేయేల? జపానుయొక్క పూర్వచరిత్ర మంతయుఁ బ్రదర్శింపఁబడును. ఏపాత్రయయిన సంతోషమును గలిగించిన యెడల జూపకులు దమటోపీలను క్రిందవిసరివేయుదురు. ఒకసేవకుఁడు వీని నన్నిఁటిని దీసి జాగ్రత్త చేయును. తరువాత వీనిని



బహుమానమిచ్చి యెవరివివారు పుచ్చుకొందురు. హారాయను, టాగోయును, ఆఱుగంటలసేపు నవ్వుచు, గేకలుకొట్టుచు, తినుచుఁ, ద్రాగుచు, నాటజరుగుచున్నంతవఱకుఁ దమయఱలోఁ గూరుచుండిరి. తరువాత నాటకము సమాప్తమయినది. ఏమన నది చాకరికము. చిన్ననాటకముగాని పెద్దది కాదు. ఈవలకు వచ్చినతరువాత తండ్రి యిట్లనియె. "ఆహా! నాచిన్నతనమున నిజమయిననాటకము లుండెడివి. వేకువనే లేచి యేడుగంటలకప్పుడే నాటకశాలలోనికి వచ్చి రాత్రిపదునొకండుగంటలవఱకు నుండెడువారము. ఇప్పుడే నాటకమును దొమ్మిదిగంటల కెక్కువ యాడకూడదని దొరతనమువారిశాసనము. ఇది మిక్కిలి తక్కువ,,

ఇట్లుపల్కినతండ్రియభిప్రాయముతో పిల్లలుకూడ నేకీభవించిరి. వారును అవ్వయుఁగలిసి తమయఱలో పడిచినగిన్నెలుమొదలయినసరకు లన్నియుఁ బోగుచేసికొనిరి. తరువాత సందఱు త్రాము గుమ్మముకడ సేవకులకడ విడిచివచ్చినపాదరక్షలను బుచ్చుకొనుటకై తమతమకొయ్యటిక్కెట్లను దీసికొనిమెల్లగా నడిచిరి. తనుజోళ్లు పుచ్చుకొని తొడుగుకొని హారాటారోలు గోటుగా నడచి యింటికిఁ బోయిరి. ఖర్చుచేయుటకు వారికడ నింకేమియు లేదు. వారిక్రొత్తడబ్బుతమాషా యయిపోయినది.

## పదమూఁడవ ప్రకరణము.



### గాలిపటము.

తీక్ష్ణమయిన పదునైదుదినములకుఁ జక్కఁగాఁ గాలివీచుచున్న యొక నెలవుదినమునాఁటి మధ్యాహ్నమున టారోయు, నాతని తమ్ముఁడు ఈటోయును గాలిపటము లెగురవేయుటకుఁ జనిరి. కొంతమంది బాలురదివఱకె యిండ్లమీఁదినుండియు, గవాక్షములనుండియుఁ గాలిపడగల నెగురవేయుచుండిరి. కానిమనబాలు రిద్దఱికి నంతకంటె విశాలమయినప్రదేశము గావలసివచ్చినందున వారు తమవీథి వెనుకనున్న యున్నతప్రదేశముమీఁదికిఁ బోయిరి. ఇచ్చట నొకగుంపు, బాలురు, వృద్ధులు ననక డెబ్బదియేండ్లువచ్చినపలితశరీరులు మొదలుకొని మూఁడేండ్లుండి తప్పటడుగులిడు కుఱ్ఱవాండ్రవఱకు నందఱు గాలిపటములను బట్టుకొని దీక్షతో వాని నెగురవేయుచుండిరి. కొంతసేపటికిఁ జంటిపిల్లనువీపునఁ బెట్టుకొని ,,ఓహారాసాన్,, కూడవచ్చెను. ఆశిశువుచేతిలోఁగూడఁ జిన్నయరచేయియంతగాలిపటము త్రాడుగట్టి యెగురవేయఁబడుచుండెను.

ఇప్పుడు టారో మిగులగరువముతో నుండెను. అతఁ డిప్పుడు తనపెద్దయుద్ధపటము నెగురవేయ సిద్ధముగా నుండెను.



అడిబలమయినముదుగుకాగితముతోడను, వెదురుచట్రముతోడను, జేయఁబడి యైదడుగులచదరము కలిగి తనతండ్రికంటె పొడుగుగ నుండెను. ఆక్రిందటిదినమున నొకయుద్ధమును పొడిచేసి జిగురుతోఁ గలిపిముప్పదియడుగులవఱకు గాలిపడగయొక్క త్రాటికిఁ బూసి యాతఁడు దాని నెండఁబెట్టెను. ఈత్రాడుతో నింకొకనిగాలిపడగయొక్క త్రాటిని నరకఁగలిగినయెడల నోడినవానిపట మీతనికి వచ్చును.

ఆబయుల ననేకరంగులగాలిపడగ లాకాశంబున నెగురుచుండెను. వానిలో నెఱుపు, పసుపు, నీలము, తెలుపు, ఆకుపచ్చ, రంగులచతురపుపడగ లనేకములు గలవు. ఇవన్నియు దేవతలయొక్కయు శూరులయొక్కయు బొమ్మలతో నలంకరింపఁబడి యుండెను. కొన్నిపటములు మత్స్యాకారముగను, గొన్ని డేగలరూపమునను, కొన్ని రాబందులయాకృతిని కొన్ని కొన్నిసీతాకోకచిలుకలపోలికని, జేయఁబడి యుండెను. కొన్నింటికి ధ్వనిచేయుటకుఁగాను తిమింగిలపు టెముకలతోఁ జేయఁబడి నబూరలు గట్టఁబడి యవి పడగ లెగురునపుడు సంగీతము బాడుచుండెను. ఇఁక యుద్ధపటము లనేకము లెగురుచుండెను. ఒకచోఁ గొన్నిపడగలకు ద్వంద్వయుద్ధము జరుగుచుండెను. వేఱొకచోఁ గొన్నినలుపుపడగలు రక్తపటములతోఁ బోరాడు

చు నొకానొకటిం దాఁకుచు, వంగుచు, పైఁబడుచు, నీప్రక్కకు నాప్రక్కకు నెగురుచు నీప్రకారము క్రిందిత్రాళ్లు లాగుటనుబట్టి విహరించుచుండెను. నడుమనడుమ నొకటి యెగిరి గాలికిఁ గొట్టుకొనిపోవుచుండెను. దానిత్రాడు ప్రత్యర్థిపటమువలనఁ ద్రెంపఁబడి పోరాటమునుండి తొలఁగింపఁబడెను.

టారో తనపటము నతిశీఘ్రముగఁ బైకెగుర వేసెను. అది చక్కఁగ నెగురుచుండఁగ దానిసంగతి యంతయు టారో బోధపఱచుకొనెను. ఒక్కొక్కగాలిపడగ యొక్కొక్కరీతి నెగురును గనుక యదిముందు తెలిసికొనుట యావశ్యకము. అంతట గౌరవర్ణముగలపడగ యొకటి దానిపైకి వచ్చుచుండెను. అతఁడు పైకిఁ జూచి దానిని 'కనయ' యనుబాలుఁడు దనపడగపై బందెము వేసి విడిచెనని తెలిసికొనెను. ఆపందెమును టారో వెంటనే యంగీకరింప రెంటికిని బోరాటము ప్రారంభమయ్యెను. తనరాబందును కనయ, టారో చతురపుపటముమీఁదికిఁ బంపిన టారో, త్రాడు విడిచి తప్పించుకొని తరువాతఁ దనపటమును గాలిలోనికిఁ బంపి రాబందుమీఁదఁ బడవైచెను. కాని కనయ త్రాడు దీసుకొని దానికందకుండఁ జేసెను. ఈప్రకారమొండొంటిం దాఁకుచుఁ దప్పించుకొనుచు, గంటకుఁ బైగా, రెండును బోరాడినపిమ్మట గాలి కనయ రాబందున కనుకూలించి టారో



పడగతప్పించుకొనుటకు వీలులేకుండ పైఁబడెను. త్రాడు లొండొంటిం దగులుకొని పైనున్నరాబందు క్రిందిపడగను లాఁగఁ దీయుచుండెను.

టారో తనపడగను దప్పింపఁ బ్రయత్నించెను గాని కార్యము లేకపోయెను. రాబందుత్రాడు బలముగాను, వాఁడిగాను నుండెను. నిముషములో టారోత్రాటికి నడి తగ్గిపోయెను. అతనిపటము బిగువుగా లాగుచుండుట మానివేసెను. అది తల క్రిందుగా నేలపైఁ బడుచుండెను. కనయ జయము నొందెను. టారో మర్యాదతో తనయపజయము నొప్పుకొనుట కంటె జేయఁదగినది లేదయ్యె. చిరునవ్వునవ్వుచు నాతఁడు జయశాలికి మూఁడుసలాములు చేసెను. కనయయును గాంభీర్యముతో వానికిఁ బ్రతినతులొనర్చి తాగెల్చుకొన్న పడగను దెచ్చుకొనుటకుఁ బరుగెత్తిపోయెను.

టారోతమ్ముఁడు ఈటో యనువాఁడీచిత్రమునంతను జూచుచుండెను. తనయన్న యోడిపోయి యాతనిపటమును కనయ గెల్చుకొన్నందులకు అతఁడేమియు దీనతను మోమున గనఁబఱపలేదు. కాని, త[illegible]మునకుఁ ద్రాడు వదలి కనయ తిరిగియెగురవేయువఱకు నెదురుచూచుచున్నప్పుడాతనికన్నులు కొంచెము మెఱ[illegible]వగాఁ బ్రకాశించెను.

ఈటో తనయన్నయొక్క ప్రాతపడగ నొకదానిఁ బుచ్చుకొనెను. అది రెండడుగుల చతురముగలది. దానిత్రాటి ‹కీటో› కూడ గాజుపొడియును జిగురును బట్టించి యుద్ధమునకు సిద్ధమయ్యెను. పదినిముషములలో ‹కనయ› మరల నెగురవేయుటకుఁ బ్రారంభించెను. తనరాబందును మానివేసి తా గెల్చుకొన్న ‹టారో› పడగ నాతఁడెగురవేయుచుండెను. అదియును, కొంత పైకిఁ బోయినతోడనే యొకచిన్న చతురపుగాలిపటము పెద్దమెత్తునుండి దానిమీఁదికి వచ్చుచుండెను. ఈప్రకార ‹మీటో› యుద్ధములోఁ జేరెను. మరల పోరాటము ప్రారంభమయ్యెను.

ఈసంగరము మొదటిదానికంటె పట్టుదలతో నంతకంటె నెక్కువసేపు జరిగెను. కాని, యిందు ‹ఈటో› యెక్కువచాతుర్యమును గనఁబఱచెను. అనేకమంది గుమిగూడి నిశ్శబ్దముగాను గాంభీర్యముగాను దానిం జూచుచుండిరి. వెంటనే గాలి సవ్యమై ‹యీటో› విజృంభించి ‹కనయ› పటముపైఁ దనపటమును జతురతతోఁ బఱపెను. ‹‹చూడుచూడు›› మను కేకలు చూపరులందు బయలుదేరెను. అంతలో ‹కనయ› పటము దొర్లుచుఁ గ్రిందఁబడెను. ‹కనయ› ‹యీటో› లు మామూలు మర్యాదలను జేసికొనిరి. అప్పుడీటో యేమియు మాటలాడకుండ సోదరునిం జూచెను.



టారోయును దనపడగను బట్టుకొనుటకుఁ బరుగెత్తికొని పోయి దానిం దెచ్చి తమ్మునితో ‹‹యీటో! ఇదినీది. నీవు పుచ్చుకొనుము›› అని పల్కెను. అందు కీటో ‹‹అక్కఱలేదు. ఎవరివివారు పుచ్చుకొందము. ‹కనయ› నుండి దానిని మరల గెల్చుకొనుటయే నాకు సంతోషము›› నియెను.

---

## ప దు నా ల వ ప్ర క ర ణ ము.

### దేవతాకథలు.

టారోయీటో లింటికి గాలిపడగలు గొనిపోయి, యలసినవారగుట విశ్రమించుటకై యాసీనులయిరి. తరువాత లక్కగిన్నెలు పెట్టుకొని భోజనము చేసి వారియవ్వ నొకకథ చెప్పుమనియడుగగా నామె యాదేశపుపిల్లల కతిప్రీతికరమయిన ‹మొమొటారో› యొక్కకథను జెప్పఁదొడఁగెను. పూర్వకాలమున నొకముసలివాఁడును, ముసలిదియు నొకపర్వతముప్రక్కను బ్రవహించుచున్న యొకనదీతీరమున వాసముసేయుచుండిరి. ప్రతిదినమును ముసలివాఁడు కొండమీఁదికిఁ బోయి కట్టెలు గొట్టి

యింటికిఁ దెచ్చుచుండును. ముసలిది నదికిఁ బోయి బట్టలుదికి
తెచ్చుచుండును. పిల్లలు లేనందున నాముసలిది తరుచు వగచు
చుండెను. ఒక్కకొడుకుగాని, కూతురుగాని యుండెనా యెం
తయదృష్టవంతురాలనై యుందునోయని యనుకొనుచుండును.

ఇట్లుండ నొకనాఁడు నదిలో నామె బట్టలుదుకుచుండఁగా
నేదో నదిలోఁ గొట్టుకొనివచ్చుచుండెను. అది చూడగ నొకగొ
ప్పపండుగాఁ గాన్పించెను. ఆమె దానింబట్టుకొని యింటికిఁ దీసి
కొనిపోవుచుండఁగా నందులో నొకపిల్ల యేడుపు వినవచ్చెను.
అంతట నామె వెనుకముందు నిటునటు చూచెనుగాని యెచ్చ
టను బిడ్డ గనిపించదాయెను. మఱల నేడుపు వినవచ్చెను. అం
దుమీఁదట నది యాపండులోనుండియే వచ్చుచుండె నని యెంచి
దానిం గోసిన నామె సంతోష ముప్పొంగ దాసినదుము నొకపిల్ల
గూరుచుండి యుండెను. ఆపిల్లనుదీసికొని పెంచి పండులో
దొరకినందున నాపండునామముం బట్టి యాపిల్లవానికి 'మొమొ
టారో' యని పేరుపెట్టెను.

మొమొటారో బలవంతుఁడుగాను చక్కగాను బెరిగి
పదునేడేండ్లవయసువాఁడైనతరువాత ధనముసంపాదింపవలె నని
బయలుదేరెను. ఒకద్వీపమునందలి నివసించుచున్న రాక్షసి ను
క్కడానినిఁ జంపి ధనము గడింపవలెనని యాతఁడు నిశ్చయించు
కొనెను. ఇట్లు బయలుదేరిన నాతనికి దారిలోఁ గినుటకుఁ గావ



లసినంతయాహారమును సమకూర్చి యిచ్చెను. దానిం బుచ్చు
కొని, వాఁడు బయలుదేరి కొంచెము దూరము పోయియొకకంది
రీగను జూచెను అది "మొమొటారో! నీయాహారములో నా
కుఁ గొంచెమిచ్చితివేని నేను నీతో వచ్చి నీకు సాయమొనర్చె
ద నని చెప్పెను. వల్లెయని యాతఁ డట్లిచ్చెను. తరువాతఁ గొం
తదూరము పోగా నొకపీతగనిపించి యదియు నాతనితో నట్టి
యేర్పాటు చేసి కొని కూడఁ జనెను. మఱికొంతదూర మేగినత
రువాత నొకపోకచెక్కయుఁ బిమ్మట నొకతిరుగలిరాయియు
నట్లే యతనికి తోడుపడ నేతెంచిరి.

ఇట్లయిదుగురును గలిసి యాద్వీపమునకుఁ బోయి యా
రాక్షసియిల్లు సేరునప్పటికది యింట లేకుండె. ఆయదనుజూచి
వారొకయుపాయమును బన్నిరి. పోకచెక్క యక్కడనున్న
నిప్పులోఁ బడెను. పీతయొక్క నీటిగిన్నెలో దాఁగియుండెను. కం
దిరీగ యొకమూలనొదిగి యుండెను. తిరుగలి యింటిపై కెక్కె
ను. మొమొటారో యింటివెలుపలఁ బొంచియుండెను.

కొంతసేపటికి రాక్షసి యింటికివచ్చి చలిగాచుకొను
టకు నిప్పులవద్దకుఁ బోయెను. వెంటనే పోకచెక్క పేలి చేతుల
నిండ నిప్పులుపోసెను. ఆరాక్షసి లేచిపోయి చేతులురెంటిని
నీటిగిన్నెలో ముంచెను. తోడనే యందున్నపీత యాచేతులం
గఱచి యేడ్పించెను. ఆరక్కసి యెట్లో చేతులు విడిపించుకొని

మూలకుఁ బోయి కూర్చుండెను. అంతటఁ గందిరీగ లేచి యొడ
లంతయు దద్దుర్లుగట్టునట్లు కుట్టెను. దీనికి భయపడి రక్కసి
యింటిలోనుండి యావలకుఁ బరుగెత్తి నింటిమీఁదనున్న తిరు
గలిరాయి నెత్తిమీఁదఁ బడి దానిం జంపెను. అట్లు తనకే
మియు శ్రమగలుగకుండ తనయుదారగుణమువలన సంపాదించు
కొన్న కృతజ్ఞులయినస్నేహితులసహాయముచేత మొమొటారో
యారక్కసియొక్క ధనమంతయుఁ దీసికొని భాగ్యవంతుఁడ
య్యెను.

తరువాత వారియవ్వ, బాటసారులకును, బాలురకును
రక్షకుఁడును, ఆర్తశరణ్యుండునునగు "జిజో," యనువానికథను
జెప్పెను.

రోడ్డుప్రక్కలఁ బ్రతిచోటను "జిజో," యొక్కబొమ్మ
లుండును. కొన్నిచోట్ల రాతితోఁగట్టబడినపెద్దబొమ్మలును,
గొన్నిచోట్లఁజిన్నచిన్నకఱ్ఱబొమ్మలును, బెట్టఁబడి యుండును.
వానిమొగములు కరుణఁ జిలుకుచుండును. ఒకచేతఁ బెద్దకఱ్ఱయు
రెండవచేత నొకబంతియు నుండును. అతఁ డొకతామరపూవు
మీఁద నిలిచియుండును. అతనిపాదములకడ గులకరాళ్లగుట్ట,
యుండును. ప్రతిమార్గస్థుఁడు నక్కడ నొకగులకరాయివై
చుచుండును. కాఁబట్టి మీరెన్నఁడు గులకరాయి యుప్పనము జె



ల్లించకుండఁ "జిజో," బొమ్మను దాటి పోకుఁడని యాయవ్వతన
మనుమలకు భయము చెప్పెను. చనిపోయినప్రతిబిడ్డయుఁ
బాతాళలోకమందలి "సోడ్జుక్వా," యనునదిని దాఁటవలయును.
దానియొడ్డున నొకముసలిపంది యుండును. అది నదిని దాఁటు
చున్నపిల్లలనుబట్టుకొని వారిబట్టలు దొంగిలించి వారిచేత నాన
దియొడ్డున రాళ్లుపేర్పించును. దాని కది యెల్లప్పుడు నెడతెగని
పనియై యుండును. ఈ "జిజో," యాపిల్లలను గాపాడును. దాని
పాదముల కొకరాయి సమర్పించిన నది పిల్లల కీబాధనుతప్పిం
చును.

పల్లెపిల్లవాఁ డగు "ఉరషిమా," యనువానికథ యొకటి
యచ్చట నందఱును జెప్పుకొందురు. "ఉరషిమా," యనువాఁడొ
కచక్కనిపల్లెపిల్లవాఁడు. వాఁడు జపానుసముద్రమీఁదనివసించు
చుఁ బ్రతిదినమును దల్లిదండ్రుల కొఱకుఁ జేఁపలఁబట్టి తెచ్చు
చుండును. ఒకనాఁ డట్లు చేఁపలకుఁ బోయిమరల రాఁడయ్యె.
వానితల్లి చాలసేపు వేచియుండెనుగాని యెంతసేపటికి నాతని
పడవజాడ గానరాలేదు. ఇట్లు కొన్నిదినములు గడచిపోవఁ దుద
కాతఁడు మృతుఁ డయ్యెనని యెంచుకొనిరి. కాని, యాతఁడు
చావలేదు, సముద్రముమీఁద నతనికి సముద్రునికూఁతురు ప్ర
త్యక్షమై వానిని, దనసదనమునకుఁ గొనిపోయెను. అచ్చట నె
ప్పుడును వసంతకాలముగా నుండును. అచట వారిరువురును బ

రస్పరానురాగముమీర సుఖంబులం దేలుచుఁ గొంతకాలము
గడపిరి. అంతటఁ దావచ్చి చాలకాల మయ్యె ననియుఁ దల్లి
దండ్రులు దనకొఱకు దుఃఖపడుచుఁ దానుమృతినొందె నని తలం
తు రనియుఁ దనసఖితో నురషీము చెప్పెను. ఎట్టకేల కాతఁడుపో
వుట కామె యంగీకరించి యొకపెట్టె నాతనిచేతి కిచ్చి దీని
నెప్పుడును, మూసియుంచవలయుననియు, నట్లు మూసియుంచి
నన్నినాళ్లు నేను నీతో నుండెద ననియు, దీనిం దెఱచినతోడనే
నేనును నీసతతవసంతకాలముతోనున్న యిద్దేశమునుగూడ నదృ
శ్య మగు ననియుఁ జెప్పెను.

ఉరషీమాయు నాపెట్టెను బుచ్చుకొని దానినెప్పుడును
మూసి యుంచెద నని చెప్పి యింటికిఁ జనెను. కాని, యతని
యూరు మాయమయ్యెను. ఆయొడ్డున నెచ్చట నిండ్లున్నయాన
వాలయినను లేదు. అచటి కనతిదూరమునఁ దానెన్నఁడుఁ జూచి
యెఱుఁగనిపట్టణ మొకటి కానవచ్చెను. వాస్తవముచేత నతఁడా
దేవకన్యతోఁ గడపినప్రతివారము నొకశతాబ్దము కాలమై యుం
డెను. గనుక యాతఁడు మున్నున్నచోటు మఱచిపోయెను. ఇ
ట్లునిరాశుఁడై మనసు కలఁగి యాకన్యచెప్పినమాట మఱచి
యాపె యిచ్చినపెట్టెను దెరచెను. శ్యామలవర్ణముగలమంచొ
కటి వెంటనే సముద్రముమీఁద వ్యాపించెను. దానితోడనే



యురషీము శరీరమం దొకవింతమార్పు గలిగెను. చక్కనివాఁడై
యౌవనమందున్నయాతఁడు నిమిషములో తేవలేనిముసలివాఁడై
యొడ్డునఁ బడి చచ్చిపోయెను. ఆబుట్టలో నాదేవకన్య వారిసు
ఖదినములన్నిఁటిని బంధించి యుంచెను. అవి తప్పించుకొని పోఁ
గానే యతఁడు తక్కినమనుష్యులవంటివాఁడే యయి జరామర
ణము లాకస్మికముగ వాని నాక్రమించెను.

---

## పదునైదవ ప్రకరణము

### తేనీళ్ళయిండ్లు — దేవాలయములు.

జపానీయులమనసులకు దేవాలయములనగనే తేనీళ్లయిం
డ్లు జ్ఞాపకమువచ్చును. ఏమనిన నెచ్చట దేవాలయము లుం
డునో యచ్చటఁ దప్పక తేనీళ్ళయిండ్లుకూడ నుండును. కాని
తేనీళ్లదుకాణములు ప్రత్యేకము దేవాలయములదగ్గఱమాత్రమే
కాక ప్రతిచోటను నుండును. జపానులోఁ దేనీళ్లయిండ్లు పెద్ద
విందులు జరుగుచోటులుగా నుండును. అవి కొన్ని గడ్డితో నే
యఁబడినచిన్నకుటీరములుగా నుండి కూలివాండ్రులోనగువారు
వచ్చునవియై యుండును. మఱికొన్ని మంచిభవనములుగా నుండి

సరంబీ సేయఁబడి ప్రశస్తమయినబల్లలు మొదలగుసామానులను గలిగియుండును.

తేనీళ్లయంగడియం దొక తేనీళ్లుమాత్రమే యమ్మఁబడవు. అది నీకు విడిదిగా వినియోగించి భోజనము మొదలగునవి దొరకుచోటు. పల్లెటూళ్ళలో నదియే పూటకూటియిల్లుగా నుండును. ఈ తేనీళ్ళయిండ్లలోఁ బ్రత్యేకముగాఁ దేనీళ్లు తప్ప మతేమియుదొరకనియెడల నచ్చటఁ బ్రయాణము చేయుయూరోపియనులయవస్థ యడుగనక్కఱలేదు. అక్కడ నమ్మెడు తేనీళ్లు వారి కెవ్వరికిని రుచియింపవు. ఈవిషయము నందఱు నేకగ్రీవముగా నంగీకరించి యున్నారు. నీవది త్రాగినను త్రాగకున్నను దానిఖరీ దిచ్చినఁ జాలును. ఆఖరీదైన నెంతో యుండదు. ఒకటిన్నరయణా యుండును.

మొటసారి యెవ్వఁడేని తేనీళ్ళయింటిలో నడుగుపెట్టగానే యక్కడ నుండుబాలిక లెల్లనిచొక్కాలు దొడిగి వానికి వంగి నమస్కరించుదురు. అది మారుమూలదేశమయి పూర్వాచారము లింకను విరివిగా వాడుకలోనున్న యెడల సాష్టాంగనమస్కారము చేయుదురు. తరువాత తేనీళ్ళు దెచ్చుటకుఁ బరుగెత్తుదురు. పరుగెత్తుట గౌరవమునకు గుఱుతు. నడిచి వెళ్లుట నిర్లక్ష్యమును సూచించునని వారియాశయము. తరువాత నొకలక్కపాత్రలోఁ బోసి తేనీళ్ళను దానితో నైదు తేనీటిగిన్నెలను



వచ్చును. ఈగిన్నెలకుఁ బట్టుకొనుటకుఁ గొక్కెములుండవు. ఆతేనీళ్ళలోఁ బాలుగాని పంచదారగాని వేయరు. అవిగడ్డి రంగు గలిగి చేదుగా నుండును. అందుచేత నవి యైరోపాదేశీయులకు మిగుల వెగటుగా నుండును. అయినప్పటికి గిన్నె నెత్తి పెద్దవులధగ్గఱ బెట్టుకొని 1½ పెన్నులనిచ్చివేసినఁ జాలును. ఇట్లు తేనీళ్ళ నిచ్చునాచారము జపానునం దంతట గలదు. ఇది తేనీటియంగడియందేగాక ప్రతిచోటను జరుగును. ఎవ్వరైన స్నేహితుఁడు చూడవచ్చినయెడల వెంటనే తేనీళ్ళు సిద్ధముగా నుండును. మంచిసాపులోనికిఁ బోయితిమేని ముందు తేనీళ్ళు పుచ్చుకొనకుండ వ్యవహారము ప్రారంభము కాదు. కొనవచ్చిన వారు చాలసరకులు గొనుచునెక్కువసేపుండినయెడల మధ్య మధ్య తేనీళ్ళియఁబడును. వట్టితేనీళ్ళునీకిష్టము లేనియెడల షెర్రీపువ్వులరసమందుఁ బోయుదురు. కాని, పాలును జక్కెరయును గోరునైరోపియనులకదియును రుచియింపదు. నీవారాత్రి యచట నాగియున్నయెడలఁ గొన్ని తెఱలు లాగి నీకొకగది నేర్పఱచి బొంతలతోఁ బక్క వేయుదురు. వారు నీకు సమకూర్చునవి యివిమాత్రమే. ఇంక నేమయిన నీకుఁ గావలసినయెడల వానిని నీవే తెచ్చుకొనవలెను.

పట్టణములలోనిగొప్పరకము తేనీళ్లయిండ్లలో మంచిమంచి విందులు జరుగును. ఒకజపానీయుఁడు తనస్నేహితులకు విందు

చేయఁగోరినయెడల నాతఁడు వారిని దనయింటికిఁ బిలువక యొక ప్రసిద్ధికెక్కిన తేనీళ్లయింటికిఁ బిలుచుకొనిపోవును. అచ్చట భోజనపదార్థము లన్నియు సమృద్ధిగా సమకూర్చుటయే గాక భోజనానంతరము వినోదార్థము "గెయిషా" యనుభోగము మేళమును గుదిర్చి నృత్తగీతముల దనయతిథుల సంతోషపెట్టును.

ఇట్టి విందు పరదేశస్థుల కెంతయు వింతగాఁ గోచరించును. గుమ్మముకడనే బూట్సు విడువవలయును. తరువాతఁ జాపలమీఁద నడిచిపోయి కొన్నిగంటలు క్రింద మడఁతులమీఁద గూరుచుండవలెను. దీనితో వానికిఁ గాళ్లునొప్పులెత్తి గోడకుఁ జేరఁబడి కాళ్లు జాపుకొనవలసి వచ్చును. వానిముం దొకపీట యుండిన నుండును. లేదా, లేకపోవును. పీటయున్నను నది యొకయడుగెత్తుమాత్ర ముండును. ఇంక దానిమీఁద గుడ్డ, గ్లాసులు. కత్తులు, కారులు, గరిటెలు, చేరుమాలు మొదలగున వేవియు నుండవు. [యూరోపియనుల కివి గావలెను] రెండుపుల్లలతో నన్నము దినవలయును. ఇవి వానిముందుఁ బెట్టగానే యవి రెండు నెప్పుడును గలిసియున్నట్లు తోఁచును. ఇట్లు కలిపి యుంచుట వాని నిదివఱకు వాడుకచేయనిక్రొత్తపుల్ల లని దెల్పుటకు. ఈరెంటిని విడఁదీసి యీరెండుపెన్సిలువంటిపుల్లలతో నన్నము దినుటెట్లని యబ్బురపడును.



మూస్మేలను బాలికలు మొదటఁ దేనీళ్లుదెచ్చి ప్రతియతిథికి నిచ్చును. దానితో విందు ప్రారంభ మగును. పరిచారిక లందఱు మిగుల నందమయినవస్త్రములను ధరించి మెరసెడు పట్టీలను గట్టుకొని యుందురు.

తేనీళ్లతరువాతఁ జిక్కుడుపిండితోడను జక్కెరతోడను జేయఁబడిన తేనెలో వేసిన తెల్లనియప్పచ్చులను వడ్డించెదరు. తరువాత రెండుమూఁడుగిన్నెలు దెచ్చి ప్రతివారిముందును బెట్టుదురు. వీనిలో నెంకుచేఁపలు వాసనగొట్టెడుపులుసులో వేసిన యొకవిధమయినసముద్రపుచేఁపలు, ఉడకఁబెట్టఁబడిన తామరగింజలు నుండును. దాహమునిమిత్తము "సాకె" యనుకూటిసారాయముఁ గూడ నిత్తురు.

పరదేశస్థుఁడు వీని నొకదానితరువాత నొకటిరుచిచూచి యొకటికంటె నొకటి వెగటుగా నుండుటచే నవి యట్లుంచి, తరువాతిదాని కెదురుచూచుచు నూరకుండును. వీనితరువాత వడ్డింపఁబడునవి పచ్చిచేఁపలు వీనిని బులుసులో ముంచి తిందురు. తరువాత నన్నము వడ్డింతురు. ఇప్పుడు మొదటఁ జెప్పఁబడినపుల్లలు విచిత్రముగాఁ బనిచేయును. ఆదేశస్థు లాకఱ్ఱపుల్లలు గాని దంతపుపుల్లలుగాని పుచ్చుకొని మితిమీఱినచాతుర్యముతో నతివేగముగా నన్నమును దమనోటిలోనికిఁ గొట్టుకొందురు.

కాని దురదృష్టవంతుఁడగు విదేశస్థుఁ డయిదాఱునిముసములకొక మొత్తుకైన లోపలకుఁ బోక చివర కొకగరిటె నిమ్మని ప్రార్థింపవలసివచ్చును.

తరువాత వడ్డన చేపలపులుసు, నుడకఁ బెట్టిన చేపలు, హీనితో బంగాళాదుంపలును, వడ్డించెదరు. కాని చేపలరుచి విరుద్ధముగా నుండును. గుంపలు తీయగా నుండును. అవి పంచదారతోఁ బాకముఁ బట్టుదురు. తరువాత నింకొకవిధమయిన పులుసును, ఊరుగాయలును, వడ్డించెదరు.

కట్టకడపట నిప్పులో నూరఁబెట్టిన Plunes పండ్లు వడ్డించెదరు. విదేశీయుఁడు మొదట వానిలో నొకపండును నోటఁ బెట్టుకొనును గాని దానియుప్పదనమునకుఁ దాళఁజాలక వెంటనే మరలఁ దీసివేసికొనవలసినవాఁ డగును. ఇట్లొకదాని తరువాత నొకటి చూచి యేదియుఁ దనకుసరిపడక యెక్కడఁ జూచినను భోజనపదార్థము లేగాని తినుట కొకమెత్తుకైన లేద,నుపూర్వపునావికులపాటను స్మృతికిఁ దెచ్చికొనును.

భోజనానంతరము విందులను నృత్యగీతములచే నానందింపఁజేయుటకుఁ బట్టుబట్టలును గట్టి గోటుగా నీటుగా గేయిషా యనువారవనితలు వత్తురు. ఆనృత్తగీతములు రెండును గూడ ఐరోపాదేశీయులకు రుచింపవు. ఆవారకాంత మొగమునకు దెల్లరంగును, పెదవులకెఱ్ఱరంగును వేసికొని యొకవిధమైన



చితారు శ్రుతి వేసికొని పాడునుగాని యందు సంగీత మంతగాఁ గాన్పింపదు. అది యొకపెద్దరోదనముగా నుండి ఐరోపియనులకు శ్రుతికటువుగా నుండును. ఇఁక నృత్యమన్ననో మూగవానిసంజ్ఞలవలె నుండును. అనేకవిధములయిన యభినయములు గలిగి దానియర్థమును విననిక్రియయొక్క చలనములవలన దెలుపుచుండును. [సంగీతమునందును, అభినయమునందును, ఐరోపియనులను ప్రమాణముగాఁ దీసికొనవచ్చునా యనునది వివాదాంశము. పైనిజెప్పఁబడిన సంగీతాభినయములు మనదేశపుమేజువాణీని బోలియున్నట్లు దోఁచుచున్నవి. అవి తెలిసినమొదల మనకాహ్లాదకరములుగానే యుండవచ్చునని తోఁచెడిని. ఈవిషయమున నచటికేగి వచ్చినమనవారియభిప్రాయ మేమో తెలిసిన మేలు]

ఇంతసేపలసి విందారగించినమీదటఁ గూడ ఐరోపియనుల కాఁకలిమాత్రము తీరదు. అతఁడు బండికిఁ బోవుచుండగాఁ బరిచారికలన్నపుగిన్నెలు బట్టుకొనిబండికడ్డము వత్తురు. ఆగిన్నెలలో నాతఁడు దిగఁబెట్టివచ్చినపదార్థములుండును. వారిమర్యాదప్రకార మాతఁడు వానినిఁ దనతోఁగూడఁ బట్టుకొనిపోవలయును.

---

## పదునాఱవ ప్రకరణము.

—:o:—

### తేనీళ్లయిండ్లు — దేవాలయము.

(శేషము)

జపానీయులు దేవాలయములయందు మిగుల భక్తిగలవారు. వారు తరుచుగా నాలయములకుఁ బోవుచుందురు. అక్కడకుఁ బోవుట కేవలము దైవప్రార్థనముకొఱకే గాక యచట జరుగునుత్సవములు, తీర్థము లోనగువానిం జూచుటకుఁ గూడఁ బోవుచుందురు. ఏదేని యొకయుత్సవమునాఁడు దేవాలయమునకుఁ బోయి చూచినయెడల మెట్లమీఁదలోపలకుఁ బూజకుఁ బోయినవారిగొడుగులు జోళ్లు వందలకొలఁది కనఁబడును. తరువాత లోపలకుఁ బోయినవారందఱు క్రిందఁగూరుచుండి పూజ జరుగకుండనున్నయెడలఁ జుట్టలు గాల్చుచు మాటలు చెప్పుకొనుచుందురు. పిల్లలీగుంపులోఁ గ్రిందఁ బ్రాఁకులాడుచుందురు.

ఆలయములో పూజయయినతరువాత జనులందఱు విడిపోయి భోజనము చేయుటకైనఁ జల్లనితావును జూచుకొందురు. ఆలయమునకుముందు టొరోయనఁబడు నొకకఱ్ఱమంటపముండును. కొన్నికొన్నియాలయములముం దిట్టివనేకములు వరుసగా నుండును. ఆలయము కఱ్ఱతోఁ గట్టఁబడి కొన్నియెడలఁ



చిన్నదిగాను, గొన్నియెడలఁ బెద్దదిగాను నుండును. దానిచుట్టు దుకాణములును, తేనీళ్లయిండ్లు నుండును. చాలదుకాణములలో ముఖ్యమయిన దేవతలబొమ్మ లుండును. ప్రతిచోటను సప్తభాగ్యదేవతల ప్రతిమలుండును. ఇవి ప్రతిజపానీయగృహమందును మిక్కిలి భక్తితోఁ జూడఁబడును. తరువాత సస్యపాలకులగుధాన్యదేవతలదంపతులబొమ్మ లుండును. వానితోఁ గొయ్యతోఁ జేయఁబడిననక్కలుండును. సహాయము చేయుటకును, రక్షించుటకు ననేకచేతులుగల కరుణాదేవతగూడ జనరంజకమయిన్ప్రతిమ.

తరువాత రంగులు, పౌడరుపెట్టెలు లోనగు చిల్లరవస్తువులమ్మెడుదుకాణముండును. గారడివాండ్రు, మాంత్రికులు, సైరుమానులు (జెట్టీలు) మొదలగువాండ్రవాక లుండును. తేనీళ్లయిండ్లనేకము లుండును. అక్కడ భక్తులు తేనీళ్లును సాకే యను మద్యమును సేవించుచుందురు.

బాలికలు దేవాలయమునకుఁ జేరియున్నదుకాణములలో దేవునికి నివేదనజేసిన చిక్కుడుకాయలను బఠానీగింజలను అన్నమును గొనుక్కొందురు. వీనితో గుడిమీఁదనుండు పావురములను మేపుదురు. ఇవి తినుటకు పావురములు గుడిమీఁదనుండి దిగివచ్చును. మెట్లమీఁదబిచ్చగాండ్రు వరుసలుతీర్చి కూరు

చుందురు. వీరి కొక్కపైసా యిచ్చుచుందురు. అక్కడియర్చకులు ప్రార్థనాశ్లోకములను గాగితములమీఁద వ్రాసి యమ్ముదురు. వానినిఁ గొని దేవునివిగ్రహమునకు ముందు నారసములకుఁ గట్టుదురు. జనులకు విశ్వాసము గలిగిన దేవునిముం దనేకవేలకాగితపుముక్కలిట్లు కట్టఁబడి యుండును.

ఆలయపుతోఁటలు చాలరమణీయములుగా నుండును. అక్కడ జపానీయులయద్భుతమయిన యారామరక్షణాచాతుర్యమును జూడవచ్చును. కొన్ని చెట్లనేకవందలసంవత్సరములనాఁటివయ్యును, గొన్నియంగుళములపొడవుకంటె నెక్కువపొడవుండవు. కొన్నిచెట్లు మిక్కిలి పొడుగుగా నుండి యొకపడవమాదిరిగా గాని యేదేనియొకదేవునివిగ్రహమువలెఁ గాని యగపడునట్లు పెంపఁబడి యుండును.

పూఁతకాలమున నీవనములసౌందర్యమును జూచుటకనేకమంది యాలయములకుఁ బోవుదురు. “ప్లమ్” అనునది ఫిబ్రవరిలోను, ‘చెర్రీ’ అనునది యేప్రిలు మేనెలలలోను బూయును. వీనియందమును జూచి యానందించుటకు జనులు గుంపులుగూడి పోవుచుందురు. పూఁతకాలమున వందమైళ్ళదూరమున నున్నతోఁటనైనను జూడఁబోవుటకు జపానీయులు వెనుదీయరు.



చిన్ననాఁటినుండియు వారికిఁ బ్రకృతిసౌందర్యమును బరిశీలించుటొకవిద్యగా నేర్పఁబడును. పసితనమున వారిని దల్లిదండ్రులుద్యానవనములకుఁ దీసికొనిపోయి చూపింతురు. పెద్దవాండ్రు పనిని మానియైన సంతోషముతోపూఁదోటను జూడనేగెదరు.

---

## పదునేడవ ప్రకరణము.

### రిక్షావాఁడు.

ప్రసిద్ధమయినఫూజిసానుపర్వతమునుగూర్చి చెప్పితిమి. తేనీళ్లయిండ్లనుగూర్చియు దేవళములనుగూర్చియు ముచ్చటించితిమి. ఇఁక నిప్పుడు జపానునందు ముఖ్యమయినరిక్షావానింగూర్చి కొంతవఱకుఁ జెప్పవలయును. వాఁడు ధనవంతుఁడుగాని గౌరవముగలవాఁడుగాని కాఁడు. వాఁడెప్పుడును దరిద్రుఁడై కూలిజాతిలోఁ జేరినవాఁడుగా నుండును. కాని, వానియుపయోగమునుబట్టి వానికాప్రాముఖ్యత వచ్చినది. వాఁడు గుఱ్ఱపువాఁడుగను, గుఱ్ఱముగను గూడ వినియోగించును. వాఁడు తనబండితో వీథిలో వేచియుండి నీవందులో నెక్కినతోడనే బండి బుజముమీఁదఁ బెట్టుకొని పరుగెత్తును.

(జిన్ రిక్షా, యని వానిపూర్తియైన పేరు. దానికి మనుజవే
గముగలబండి యనియర్థము. అదిపెద్దదటపా పెట్టెవలె నుండును.
వానకాలమున నుపయోగించుటకు దానికి నూనెకాగితము,
ప్రత్యేకముగా నుండును. కూర్చుండుట కొకపెట్టె యుండును.
మూటలు పెట్టుకొనుటకు పెట్టెముక్రింద నొకయర యుండు
ను. రెండు తేలికయయినచక్రములును, రెండుపోలుకఱ్ఱలును
బండికుండును. రిక్షాహాఁడు కొంచెము డబ్బుగలవాఁడైనయెడల
వానిబండికి మంచిమంచిరంగులు వేయఁబడి యుండును. ఎంతపే
దవానిబండికైనను గొంతయలంకారము తప్పక చేయఁబడి యుం
డకమానదు.

రాత్రులు ప్రతిరిక్షాకును బదునెనిమిదియంగుళములపొ
డుగు గలిగి గుండ్రముగా నుండునొక కాగితపులాంతరు గట్టఁబడి
యుండును. బారివాండ్రు పరుగెత్తుచుండఁగా నీలాంతరులు ర
మణీయముగాఁ గనఁబడుచుండును. ఈరిక్షా బైసికిలంత నవీనమై
నది. మొదటిరిక్షా నలువదియేండ్లక్రిందటఁ జేయఁబడినది. తో
డనే యవి దేశమంతట నతిశీఘ్రముగా వ్యాపించినవి. ఈరిక్షా
బండి జపానునకు రోటికి లిద్దెవలె సరిపడినది. మొట్టమొదట ప
నిలేనివారి కనేకుల కది పనిఁగల్పించినది ఈబండ్లు వాడుకలోని
కి రాగానే యనేకమందిపడుచువాండ్రు పని ప్రారంభించిరి. ఇది
యప్పటిపల్లెటూర్లకును బట్టణములకును గూడ ననుకూలించినది.



పట్టణములలో వీథులు మిగుల యిరుకుగాను, జనసమ్మర్దము
గాను నుండుటచే నచ్చట గుఱ్ఱపుబండ్లపాయకరములుగా నుం
డును. అక్కడ గుఱ్ఱము లెచ్చటనో గాని యుండవు. ఒకవేళ
యెవ్వఁడైన గుఱ్ఱము నెక్కిపోవుచున్నయెడల దానిముందొకఁడు
బూరనూదుచు దారిచేయుచుండును. రిక్షావాఁడెల్లగాక నేర్పు
తో నన్నింటిని దప్పించుకొనిబండి నీడ్చుకొని పోవును.

ఇంక గ్రామములలో మార్గములు సన్నములుగాను, మి
గుల పాడుగాను, నుండును. పొలములమధ్య నుండుకాలిత్రోవ
లేగాని యంతకంటె మంచిమార్గము లుండవు. తేలికగా నుండు
టచేతను, విస్తారము స్థలమక్కఱలేక పోవుటచేతను, అచ్చట
రిక్షా యెక్కువయుపయోగముగా నుండును.

రిక్షాలో నొక్కఁడుమాత్రమే కూర్చుండును. ఒక్కఁడే
లాగును. కాని యొక్కొక్కప్పుడు దానిలో నిద్దఱుగూరుచుం
డుటకూడ తటస్థించును. ఒక్కయూరోపియనునకు సరిపడిన
చోటులో నిద్దఱుజపానీయులు సుఖముగాఁగూరుచుండఁగలరు.
ప్రయాణికుఁడు త్వరలోఁ బోవలసినయెడల నాతఁడు రెండుమను
జహయములను దనబండికిఁ గట్టించును. సమతలమున వారు బం
డి ముందుండిలాగి యెత్తుప్రదేశము నెక్కవలసివచ్చినప్పు డొ
క్కఁడు వెనుక కేగి త్రోయును ధూమనౌకమీఁదఁగాని, పొగ

బండిమీఁదఁగాని, పోయి జపానులో నెక్కడదిగినను గావలసిన న్నిరిక్షాబండ్లు బాడుగకుఁ గట్టుటకు సిద్ధముగా నుండును. ఆరిక్షావాళ్లను, వారివయసెంతయున్నను B(oys) కుఱ్ఱవాండ్రని పిలుతురు. ఎవరైన బాటసారి కనిపించువఱకును, వాండ్రు బండివెనుక నిలిచి యిత్తడిగొట్టములతోఁ బొగ్రాగుచుందురు. వారు నల్లనిలాగును జొక్కాయునుదొడుగుకొందురు. చొక్కావీఁపుమీఁద వానివానిగురుతును దెలుపు తెల్లనిబొమ్మ వ్రాయఁబడి యుండును. తెల్లనిపెద్దటోపి యొకటి వానితలమీఁద నుండును. ఎండగాయుచున్నప్పుడు డాటోపి తీసివేసి చెమట, కండ్లలోనికిఁ గారకుండ నొకగుడ్డను దలకుఁ గట్టుకొందురు. ఎండదెబ్బవలనిభయము రిక్షా వానికి లేదు.

నీవు వారికంటఁ బడఁగానే యిరువదిమంది యొకచేతితో రిక్షా నీడ్చుకొనుచు రెండవచేయి నీవైపున కెత్తి ‘రిక్షారిక్షా,’ యని యరచుచు వత్తురు. అందొకరిక్షా కుదుర్చుకొని నీవెక్కుదువు. వెంటనే యాకుఱ్ఱవాఁడు కఱ్ఱలమధ్యకుఁ బోయి బండి బుజములమీఁదఁ బెట్టుకొని తనబలవేగములు నీకుఁ దెలియునట్లు గబగబ పరుగెత్తును.

ఇట్లు పోగాఁబోగా నీవొకసన్నని వీథిఁ బ్రవేశింతువు. అక్కడ ననేకమందిపిల్లలు పెద్దవాండ్రును, స్త్రీలును, పురుషులు



ను, గూడ నుందురు. దారినడచుట దుర్లభముగా నుండును. ప్రక్క నొకదారియుండును. కాని, యాదారిలో నంగడివాండ్రు దుకాణములు పెట్టుకొందురు. అందుచేత నావీథివెంటఁ బోవువారును, ఆడుకొనుపిల్లలును వీథినడుమ నుండవలసి వచ్చును.

నీబండివాఁ డీవీథినడుమ మెల్లమెల్లఁగాఁ దప్పించుకొనుచు, బంతులాడుకొనుపిల్లలగుంపుకడ నొక్కత్రుటిమాత్ర మాఁగుచు లాగుకొని పోవుచుండును. పిల్లలనేకములైన యాటలాడుచు నిన్నుఁ దొంగిచూచుచుందురు. వారియాటవస్తువు లొకప్పుడు నీబండిలోఁబడును. నీవు వానిఁదీసి వారలకు విసరి వేయుదువు. అందులకు వారు సగౌరవముగా నమస్కరించుచుందురు. అంతలో నీతలమీఁద చప్పుడు వినఁబడును. అదేమనిచూచిన నొకయింటిమీఁద నిద్దఱుపిల్లలు నొకముసలివాఁడును గాలిపడగ లెగురవేయుచుందురు. ఇవియన్నియుఁ జూచిన నాదేశమున గుఱ్ఱములు లేకుండుటయే మంచిదయ్యె నని నీవనుకొందువు. ఎంతసాదయినగుఱ్ఱమయిన నీయల్లరులలో బెదరకమానదు.

వెలతక్కువయై యుండుట రిక్షా కింకొకవిశేషము. కుఱ్ఱవాఁడు ప్రయాణముచేసినకాలమునకు గంటకేడరపెన్నులచొప్పున నీవిత్తువు. ప్రయాణముచేయకయున్నకాలమునకు గంటకు రెండరపెన్ను లీయవలయును. రోజునకు రెండున్నరషిల్లింగు

లిచ్చినరోజంతయు వాఁడు నీకుఁబనిచేయును. కాని వారిలో కొందఱు విదేశీయులను మోసపుచ్చి గంటకు రెండు పెన్సులు పుచ్చుకొందురు.

ఇట్లు రిక్షావాఁడు వర్తకునివలెఁ గన్పడుట కడుశోచనీయము. దీనివలన సేవకునకుండవలసినగౌరవము వానికుండుట లేదు. సేవకుఁడు తనలాభమునకంటె యజమానిలాభము నెక్కువగఁ బాటించును.

కానివిదేశీయుఁ డొకరిక్షావానిని నియామకముగఁ గుదుర్చుకొన్నయెడల వాఁడు స్నేహితునివలె వినియోగించును. ఎక్కడకుఁ బోవలెనో యేమి చేయవలెనో, వాఁడే చెప్పును. ఎక్కడ నేమియుండునో వానికిఁ దెలియును. వానింగూర్చి యన్నియుఁ దెల్పును. ఏమైనఁ గొనుటకుఁ బోయినయెడల వాఁడు కూడవచ్చి షాపువాఁడు నిన్ను దగాచేయకుండఁ జూచును. నీవేదయిన పనిమీఁదఁ బోయినయెడల నీవుండుటకు మంచి తేనీళ్లయిల్లు చూచి, నీకు వండిపెట్టి, నీబట్ట లుదికి, పడకిల్లు నేర్పఱచి, హోటలువాఁడిచ్చినబిల్లు సరిగా నున్నది లేనిది చూచి వానికిచ్చి నౌకరులకు జీతమిచ్చి యన్నియుఁ జక్కఁబెట్టి నీమెప్పు వడయును.



నీవేదయిన నొకయాలయముకడఁ గాని, పూలతోఁటకడ గాని యాఁగినయెడల నీలోపున వాఁడచ్చటి తేనీళ్లయింటికడ నిలుచుక విశ్రమించును. అరలోనున్న తనయాహారపుమూటఁ దీసికొని యచ్చట దానిభుజించి నీవు వచ్చువఱకుఁ బొగ ద్రాగుచుఁ గూర్చుండును.

---

## ప దు నె ని మి ద వ ప్ర క ర ణ ము.



### గ్రామములు.

జపానుకాపు మిక్కిలి పట్టుదలతో పనిచేయుచు రాత్రింబవళ్లు తనపొలములోఁ బనిచేయును. వాఁడు వారమున కేడు రోజులును గూడఁ బనిచేసి పొలము సిద్ధమయి పంటకు వేచియుండవలసినదినములలో మాత్ర మెప్పుడయిన నొకరోజు సంతకుఁ గాని తీర్థమునకుఁగాని పోవును.

పొలమంతయు గునపముతోఁ దిరగవేసి కలుపు తలయెత్తకుండ చక్కనితోఁటవలెఁ జేయఁబడును. అనేకపైరులు పండును. అందు ముఖ్యమయినది ధాన్యము. ధాన్యము పండనిసంవత్సరము వారు కఱవువలన బాధపడుదురు.

ధాన్యము పండుటకు నీరు విస్తారము గావలసియుండును. కాఁబట్టి సమీపమున నున్ననదిలోనుండి గాని, కాలువలోనుండి గాని, చేలను దడిపి దమ్ముచేసి యందులో మొక్కలు నాటుదురు. ఈపని స్త్రీలును బురుషులునుగూడ మోకాలులోతుబురదలోఁ జేయుదురు. ఇదిమిగుల కష్టమును, మలినము నయిన పని. స్త్రీలును బురుషులునుగూడఁ దమదుస్తులను బైకిఁ గట్టుకొని యీపని చేయుదురు. మొక్కలు నాటినతరువాతఁ దిరిగి రెండుమూఁడుసారులు కలుపు దీయుటకై యీబురదలోఁ బని చేయవలసివచ్చును.

వరి పంటకు వచ్చినతరువాత చేలలోనున్ననీరుఁ దీసివేసి పొలము లెండనిత్తురు. ఈపొలములవిస్తీర్ణమును, ఆకారము ననేకవిధములుగ నుండును. విస్తీర్ణముకొన్నిచతురపుగజములు మొదలొకయకరమువఱకు నుండి యకరము విస్తీర్ణముగలపొలము పెద్దదిగా నెంచఁబడును. పొలమునకుఁ బొలమునకు నడుమఁ గంచెలుగాని దళ్లుగాని యుండవు. నేల మిగుల విలువగలిగినదగుటచేత నట్లు లెదుగనిచ్చుటకు వారికి వీలులేదు. ఇవి లేకున్నను బొలములహద్దులు జక్కగా నెవరివి వారికిఁ దెలిసియుండును.

ఇంకొకముఖ్యమయినపంట కాగితముచేయుటకై పైరు పెట్టఁబడునది. జపానుదేశపుపనులలోఁ గాగితము ప్రధానమయినది. అది ప్రతిచోటను ప్రతిపనికి నుపయోగపడును. జపానీయుఁడు కాగితపింటిలో నివసించును. కాగితపుగిన్నెతోఁ ద్రాగును. కాగితపులాంతరువెలుతురునఁ జదువుకొనును. కాగితపుదారముతోఁ గట్టలు కట్టుకొనును. కాగితపుజేబురుమాలును వాఁడుకొనును. కాగితపుదుస్తులను కాగితపుజోడును, కాగితపుటోపిని ధరించును. ఎండవానలకుఁ గాగితపుగొడుగును వేసికొనును. ఇంక ననేకపనులకుఁ గాగితము నుపయోగించును. వార ఱువదికంటె నెక్కువరకములకాగితములను జేయుదురు. ఒక్కొక్కరకముకాగిత మొక్కొక్కపనికి వినియోగించును. చించుటకు వీలులేనంతగట్టిగాను, ఎంతవాన కురిసినను నీరుదిగనిదిగాను కాగితములను వారు చేయుదురు.

ఒకనదియొద్దనకుఁ బోయితిమేని మనకుఁ బల్లెవాఁడు చేపలు బట్టుటఁ గనిపించును. వాఁడనేకవిధములుగ వానిని బట్టుకొనును. వాఁడు గాలమును, వలను, నుపయోగించును. పెద్దప్రవాహములో వలఁబన్నుచుండగా వానిఁ జూడవచ్చును. ఈవల, గుండ్రముగా నుండి పన్నెండు లేక పదునాలుగడుగులవెడల్పుండును. ఈవలచుట్టు బరువయిన యినుపగుండ్లు మునుఁగుటకుఁగాను గట్టఁబడును. ఈవల ముడిచి బుజముమీఁదఁ బెట్టుకొని యొకయన్నముముద్ద నీటిలోఁ బారవైచును. దీనినిదిను

టకుఁ జేఁపలన్నియు నక్కడకుఁ జేరును. అప్పుడు వీఁడు వలను నీటిమీఁదఁ జాపకట్టుగా విసరివేయును. ఇనుపగుండ్లు నీటిలో మునిఁగి యీచేఁపలు గొట్టములోవలెఁ జిక్కుకొనును. బలమయిన యొకపగ్గము వలకు ముడివేసి యుండును. దానితో వీఁడు వలను పైకి లాగును. ఇనుపగుండ్లు బరువుచేత దగ్గఱగాఁ జేరి వల నడుగున మూసివేసి చేఁపలను బంధించును.

ఒక్కొక్కప్పుడు వాఁడు విల్లును బాణములు నుపయోగించును. ఇందుకు ముందునీటిలో నొకవిధమయినచేదుపండ్లను ఆకులను బడవేయును. దీనివాసనకుఁ జేఁపలుపైకి వచ్చి కొట్టుకొనుచుండును. వానిని బాణములతోఁ గొట్టి బాణములకుఁ గట్టఁబడినత్రాడుతో నొడ్డునకు లాగుకొనును.

రాత్రికాఁగానే సమీపమున నున్నగ్రామజనులు నీటియొడ్డునకు వచ్చి మిణుగురుపురువులను బట్టుకొనుచు, విలాసముగా నుందురు. ఈచిన్నపురుగులు నీటిమీఁద మెరయుచుఁ జీఁకటిలో ననేకవేలచిన్నచిన్నదీపములవలెఁ గనఁబడుచుండును. వానిని బట్టుకొని పట్టిపంజరములలోఁ బెట్టుదురు. ఆపంజరముక్రిందఁ జిన్నమట్టిముద్ద యుంచి దానిమీఁద నొకజొన్నగింజ మొలవేయఁబడి యది యొకటిరెండంగుళము లెదిగియుండును. అదిగాక యందొకనీటిగిన్నెకూడ నుండును. వీనివలన నామెరుగుడుపురుగు



చాలకాలము జీవించియుండి పిల్లలకు సంతోషము నిచ్చుచుండును.

నదికి సమీపమున నొకగ్రామ ముండును. దానివీథినడుమ నొకచిన్ననీటికాలువ ప్రవహించుచుండును. ఆకాలువ యనేకపనులకుఁ బనికివచ్చును. ఆఁడువాండ్రందు బట్టలుదుకుదురు. కూరలు గడుగుదురు. స్నానమున కందునుండి నీళ్లు తెచ్చుకొందురు. దానిప్రక్కల జాలచోట్లకఱ్ఱసుత్తిదెబ్బలు వినవచ్చును. ఏమన నీకాలువనీటివలన ననేకనీటిచక్రములు దిరుగుచుండును. వీనిమూలమున కొయ్యగోకల్లు చెట్లలో దొలువఁబడిన రోళ్లలో బియ్యము దంపుచుండును. నీవువీథివెంట నడుచుచు నింటిముందటిభాగము లన్నియు దెరచియుండుచు గనుక నెవ్వరేమిచేయుచున్నదియుఁ జూడవచ్చును. ఇంటికున్నమూలలన్నియు గూడ వీథిలోనికిఁ గనిపించుచుండును.

ఇండ్లవెనుక పొడుగయినవెదుళ్లు పెరుగుచుండును. అవి యనేకపనుల కుపయోగించును. కనుక వారికి దానియం దాదర మెక్కువ. వెదురుకఱ్ఱ లిండ్లకు వాసములుగను, ఆకులు పైకప్పుగను, బనికివచ్చును. దానితో గిన్నెలు, పెట్టెలు, పళ్లెములు, తెడ్లు, నీటికాలువతూములు, నీటిబిందెలు, చేఁపలుబట్టుకొయ్యలు, పూలపాత్రలు, గొట్టములు, విసనకఱ్ఱలు, గొడుగులు,

మొదలగు ననేకవస్తువులను జేయుదురు. లేఁత వెదురుమొవ్వను తిందురు. అది మిగుల రుచ్యముగా నుండును.

వేసంగిలో సాయంకాలమునఁ బనిపాటులయిన తరువాత యూరివారందఱు దేవాలయపుచావడివద్దకుఁ జేరి బయట నృత్యము చేయుదురు. చావడినిండ నందమయినదీపములు వెలిఁగింతురు. అందొకటి "టోరో" యనునది ప్రధానమైనదీపము. "టోరో" యనఁగా బుట్టలోనిదీపమని యర్థము. ఆబుట్ట రెండడుగుల చతురము ను అయిదడుగులపొడవు నుండును. దానికొకవైపున నాలయములోనిదేవుని పేరు వ్రాయఁబడి రెండవప్రక్క నాయూరివా రెవ్వరయిన గూర్చుపద్యమును వ్రాయుటకు విడిచిపెట్టబడియుండును. "టోరో" మీద వ్రాయఁబడుటకు బద్యము గూర్చుగౌరవము దక్కించుకోవలయునని ప్రతివారును స్పర్థతో యత్నింతురు.

యౌవనులయిన స్త్రీపురుషులు చుట్టునుగూడి నాట్యము చేయుదురు. నడుమ నొకఁడు నిలిచియుండును. వాఁడు కీర్తనయును అడుగును జెప్పుచుండును. ఈనాట్యము చేయువారు పడుచువారుగాను, వివాహముకానివారుగాను, నుండుదురు. పెద్దవాండ్రు ఆలయపుమెట్లమీఁదఁ గూరుచుండి వినోదమును చూచుచుందురు [ఇదిమనదేశపురామ జనతో సరివచ్చును.]



## పందొమ్మిదవ ప్రకరణము

గ్రామములు. (శేషము)

వాన కురియునపుడు జనులు తముపైన గడ్డితో నేసు కొన్నట్లుందురు. కూలివాండ్రకు వానకాపుగూడ గడ్డితో నల్లఁబడిన చిన్నపాకవంటిది. దానికొనలు పైకి వ్యాపించియుండును. దీనిక్రోడను గొడుగువలెనుండు టోపీక్రోడను నాతఁడు తడియకుండ శరీరమును సుఖముగా నుంచుకొనును. టోపీని పెట్టుకొనని వారు పెద్దకాగితపుగొడుగును వేసికొందురు.

వేసవికాలములలో నచట వానలు విస్తారముకురియును. అప్పుడు ప్రయాణము చేయుట సహ్యముగా నుండదు. మంచి మార్గములు బురదజారు గలిగియుండును. మంచివికానిత్రోవ లసుసకలిగి యుండును. అక్కడ రిక్షా లాగువాని కాలిజోడు మాటిమాటి కూడిపోవుచుండును. ఈజోళ్లు ప్రతిదారిలో ననేకముగాఁ బడియుండును. అవి శీఘ్రముగా నరిగిపోవుటచే వానిని దారిప్రక్కలను విడిచివేయుదురు. అవి ప్రతిగొడ్డుప్రక్క ప్రతియింట నమ్మబడుచుండుటచేతను వానివిలువ మిక్కిలి తక్కువయగుటచేతను అరిగిపోయినవి దారిలో విడిచి వెంటనే క్రొత్తవి దొడుగుకొనుచుందురు. గడ్డిచెప్పులనుమనుష్యులు దొ

దుగుకొనుటయేగాక గుఱ్ఱములకు వానితోడనే లాడము కట్టుదు
రు. దట్టముయినగడ్డిచెప్పులను గుఱ్ఱపుడెక్కలకు గట్టిపెట్టుదురు.
ఈయేర్పాటంతబాగుగ నుండదు. అవి యతిత్వరలో నరిగిపో
వును గనుక మైదానింటెనిజీనువకుఁ దగిలించి యుంచుకొనవ
లెను. ప్రతిగ్రామములోను క్రొత్తవి కొనవలసియుండును. ఇవి
పెన్నునకు నాలుగిత్తురు.

ఆగ్రామములందుఁ బ్రయాణముచేయు విదేశీయుఁడు
తన్నందఱుఁ దేఱిచూచుటకు సహించుకొనవలెను. తమకంటె
భిన్నమయినమనుష్యుఁడు వారికిఁగనుపించెనా వానినందఱువిను
వశపరిశీలించి చూడ నారంభింతురు. అంతియెగాని తక్కినమ
ర్యాదకు మాత్రమేమియు లోటుండదు. వారు వానిచుట్టును
మూగి విసిగించరు. ఒకవేళ నెవ్వరయిన సమీపమునకు వచ్చి
నఁ దక్కినవారు వారిని వెంటనే మందలించి తొలఁగింతురు.
"ఆల్ఫ్రెడ్ పార్సన్సు" అనునింగ్లీషు చిత్రకారుఁడొకఁడిట్లు చెప్పు
చున్నాఁడు.

"నేను జపానున బొమ్మలు గీయుచుండఁగా నాపనిఁ
జూడఁగోరి కొందఱు గుంపుగూడి చేతికతిసమీపముగాఁ జేరిరి.
అదిచూచి నేను ఫలాహారము చేసిన తేనీళ్లయంగడివాఁ డది నా
కిబ్బందిగా నుండునని యెంచి మఱునాఁడు నేనచ్చటఁ బనిచేసి



కొనుటకై వచ్చుసరికి నాస్థలముచుట్టును చిన్నదడి గట్టియుంచె
ను. దడియనగా నక్కడక్కడ నాలుగు వెదురుకఱ్ఱలు పాతఁ
బడెను. అవి దాఁటి యొక్కరును లోనికి రారైరి. వారివినయ
విధేయత లెట్టివనగా రహదారికొకదార మడ్డుగట్టిన దారియాఁగి
పోవును.,,

జపానున నేదారియందుఁ జూచినను యాత్రాజనులు
తరుచుగానవచ్చుచుందురు. వారిలోఁ జాలమంది ఫూజిసాన్
అనుపావనపర్వతమునకుఁ బోవుచుందురు. యాత్రికునిదుస్తులను
బట్టి యతఁడు ఫూజికిఁ బోవుచున్నాఁడని తెలియవచ్చును. అతఁ
డు తెల్లనికిమోనో, తెల్లనిమేజోళ్లు, తెల్లనిచెప్పులు, తొడిగి
యంతయుఁ దెల్లనిదుస్తులతో నుండును. తెల్లనిటోపీని ధరించును.
ఎండవానలకుఁగాపుదలగా నొకచాప బుజములమీఁద నుండు
ను. మెడలోపూసలతావళము దానికొకగంటయు నుండును.
అతఁడు నడచునప్పు డాగంట విరామము లేక మ్రోగుచుండు
ను. చేతిలో నొకక్రొత్తచెప్పులకట్టయుఁ జివర కాగితపు పొన్ను
గలచేతికఱ్ఱయు నుండును.

వానియాత్రకుఁ దగులుబడి యత్యల్పము. వానికిఁ గావల
సినభోజన మతిసామాన్యము. అరపెన్నిచ్చిన వానికిఁ బసుండు
టకుఁ బఱుపులు దొరుకును. కొన్నిచోట్ల గ్రామములోవా రేవ

రయిన నూరేక యాతిథ్య మొసంగుటయుఁ గలదు. తనయతిథి
ని సత్కరించుట కాగ్రామవాసి తనకొట్టులోనుండి మంచిసామా
నునుదెచ్చును. పల్లెలలోనూరందఱికి పరిపడినసామా నంతయు
నొకకొట్టులో వేయుదురు. ఆకొట్లు బలముగాను విశాలముగా
ను గట్టఁబడి పైన మట్టిగిలాబా గాని, గచ్చుగాని, చేయఁబడి
యినుపతలుపు లమర్పఁబడియుండును. అక్కడ తరుచుగా నూ
ళ్లు కాలిపోవుట కలదు. కనుక యూరివారు తగులఁబడినను
వారివారిసొత్తుమాత్ర మాకొట్లలో భద్రముగా నుండి యిం
డ్లు మరలనతిశీఘ్రములో సిద్ధముకాఁగానే వారిసామానును వారి
కుండును.

పరుండవలసివచ్చినప్పుడు కొయ్యతలుపులు తీసి బిగించి
వేయుదురు. వారియిండ్లు పగలెల్లఁ దెరచియున్నను, రాత్రులు
ముద్రవేసినట్లు మూసివేయుదురు. అంతట గస్తీతిరుగు గ్రామ
నౌకరుగాక తక్కినవారందఱు నిశ్శబ్దముగా నిద్రింతురు. వాఁ
డుమాత్రము రెండుపుల్లలు టక్కుటిక్కుగొట్టుకొనుచునటు
నిటు దిరుగుచుండును. తాను నిద్రపోక నిద్రించువారికిఁగావల
సియున్నాననియు, నేను మిమ్ములను వెదకుచున్నానని దొంగల
కుఁ దెలియుటకును వాఁడాపుల్లను వాయించుచుండును.

---



## ఇరువదియవ ప్రకరణము.



### ఆరక్షకభటుఁడు—యుద్ధభటుఁడు

జపానునందు పోలీసువాండ్రు పెద్దమనుష్యులుగా నుం
డురు. వారు సాముఱాయియనుసద్వంశస్థులయి ప్రజలందఱిచేత
ను గౌరవింపఁబడుచుందురు. వాఁడుజపానీయులలో మిగులపొ
ట్టివాఁడుగా నుండి నాలుగడుగులపదియంగళములు మొదలు
అయిదడుగులవఱకు నుండునుగాని వానియధికారముమాత్ర
ము మిక్కిలి పొడుగుగా నుండును. పూర్వము సాముఱాయిలు
చెదరిపోయినప్పుడు వారు ప్రవేశించుటకుఁ దగినవృత్తులు లేక
పోయెను. వ్యవసాయము వర్తకము వారికి నిరసనము
లయ్యెను. కానిచాలమంది సేవకులు అచ్చుపనివాండ్రు, ఆరక్షక
భటులు నయిరి. ఇదివింతగాఁ గనిపించును గాని దానికి మంచి
కారణములు గలవు.

సేవకవృత్తి యీదేశమందు గౌరవముగాఁ జూడఁబడుట
చేఁ జాలమంది సేవకు లయిరి. చదువనేర్చినజాతిలోవా రగుటచే
తను, జపానుదేశపు చిక్కగలవర్ణమాలను సులభముగాఁ దెలిసి
కొనఁగలిగినవారు వారే యగుటను ననేకులు ముద్రణమునఁ

ప్రవేశించిరి. సహజముగ యుద్ధాభిలాష గలవారగుటచేతను, అధికారము చేయుట వారి కభ్యాసమగుటచేతను బెక్కుమంది యారక్షకభటు లయిరి. ప్రజలమీఁద వారికిఁగలయధికారమునకు మేర లేదు. దానికిని బలమయిన కారణములు గలవు.

నలువదియేండ్లక్రిందట జపాను దేశప్రజనులందఱు పాలితులు, పాలకులు, నని రెండుతెగలుగ విభజింపఁబడియుండిరి. సామంతరాజులును వారిపరిజనులయినసాము రాయిలు2000000 మందియుఁ బాలకజాతిలోనివారు. మిగిలిన 38600000మందిజనులును బాలితులు. పూర్వము డైమియో యొకఁడు తననగరు విడిచి ప్రయాణమైనయెడల నాతఁడు కాగోయనుమూయఁబడిన యొకబండిలోఁ బోవును. బండితోఁగూడ నాతనిసాము రాయిలు కావలియుందురు. ప్రజలలో నెవ్వరైన నాబండిని జూచిన తోడనే యాతఁడు దారివిడిచియావలఁ బోవలెను. లేదా బండిపోవువఱకు సాష్టాంగముగా నేలఁబడి యుండవలె. అతఁడట్లుచేయకున్నచోఁ గూడనున్న సాము రాయిలు వెంటనే యాతనిబొడిచి చంపుదురు. దానికెవ్వరు నడ్డుపెట్టరాదు. రెండుకత్తులజాతికిఁ జేరనివారి నిట్లుచేయునాచారము ప్రజలకు సాము రాయిలయెడల మిగుల గౌరవముగలవారినిగాఁ జేసినది. ఆగౌరవ మిప్పు డారక్షకభటులకు సంక్రమించినది.



జపానీయఆరక్షకభటుఁడు (పోలీసువాఁడు) కుస్తీయందుఁగూడ గౌరవార్హుఁడు. అతఁడెంతపొట్టివాఁడైనను నతనిముందర నెంతపొడుగైన విదేశీయుఁడును నిలువఁజాలఁడు. జపానుదేశపుకుస్తీలో నాతఁడెంతయు నారితేరినవాఁడయి యుండును. ఈపద్ధతిప్రకారము మల్లుఁడు దనప్రతిశత్రుని దనకు లొంగిపోవువఱకుఁ దనయిష్టమువచ్చినట్లు పట్టుకొని విసరివేయవచ్చును. ఒకచిన్న జపానుపోలీసువాఁడు ఆఱడుగులుగల రష్యాదేశపునావికుని బట్టుకొన్న ట్లొకరు వ్రాయుచున్నారు. వారిరువురిపోరాటము ను రాక్షసుఁడును బాలుఁడును బోరునట్లు తోఁచెను. నావికుఁడు మాటిమాటికిని దనయల్పప్రతిశత్రునిమీఁదఁ బడఁజూచెను గాని యాతఁడు చులకనగాఁ దప్పించుకొని తానతనిఁబట్టుటకు సమయము నిరీక్షించుచుండెను. చిట్టచివర కది తటస్థించెను. నావికుఁ డాగ్రహముతో నొకత్రోపుత్రోసెను. అప్పు డారక్షకభటుఁడు వానిని గుత్తితోఁ బట్టుకొనెను. ఆనావికుఁడు సరిగా పోలీసువాని నెత్తిమీఁది కెగిరెనుగాని, తోడనే యొకపండ్రెండడుగులదూరమునఁ గుప్పవలెఁ గూలెను. అతఁడు సొమ్మసిల్లి పోయి లేచునప్పటికిఁ బోలీసువాఁ డాతని పట్టుకొని త్రాడుకట్టి సగర్వముగా స్టేషనునకుఁ గొనిపోయెను.

అక్కడ బోలీసువారికిఁ బ్రజలవలన నేమియుఁ జిక్కులు లేవు. వారుమాటాడకుండ వెంటనే చెప్పినమాట విందురు.

ఎక్కడనైన నొకగుంపు చేరిన వేషము వేసికొన్న పొట్టివాఁడు వచ్చినాఁడని చెప్పినతోడనే యందఱు బికాబికలై పోదురు. ఒక్కొక్కప్పుడు పోలీసువాఁడు కూలీలకును రిక్షావాండ్రకును దప్పుచేసినందులకుపన్యాస మిచ్చుచుండును. నేరముచేసినవాఁడును దనటోపీని చేతులలోఁ బెట్టుకొని వినమ్రుఁడయి వినుచుండును.

జనమన్నకొన్నవాఁ డగుటచేత పోలీసువానికి శిల్పములయందును శిల్పులయందు నాదరణ మెక్కువ గలిగి యచ్చటిప్రకృతిని జిత్రించుచున్న విదేశీయులకు సాయపడ ముచ్చటపడుచుండును. "మార్టిమన్ మెంపిస్" అనునతఁడిట్లు చెప్పుచున్నాఁడు.

" అచట పోలీసువానిని జూడఁజాలసంతోషకరముగా నుండును. నేనొకసారి వ్రాయుచున్నప్పు డెవ్వరయిన మార్గస్థుఁడు కిటికీలోనుంచి చూచినయెడల నాకుఁ గావలసిన దేమో యాతఁడు వెంటనే గ్రహించును. నేనువ్రాయుటయగువఱకు నాతఁ డాప్రాపులోఁ జూచుచు కదలక మెదలక బొమ్మవలె నట్లే నిలిచి యుండును. పోలీసువాఁడీలోపున వీథిపైకిఁ గ్రిందికిఁ దిరుగుచు నాకుసాహాయ్యము చేయుటకు సంతోషము కలిగి యున్నగాక యన్నిదిక్కులు చూచుచు నావీథిని వచ్చువారి నెవ్వరిని రానీక మఱియొకదానిని బోవునట్లు చేయును.



జపానుయుద్ధభటులఖ్యాతి లోకమంతయు నిండియున్న యీదినములలో మనమిచ్చట విశేషముగాఁ జెప్పనక్కఱలేదు. వానియోర్పు, వానివిధేయత, వానిధైర్యము రష్యాతో యుద్ధముజరిగినప్పు డత్యద్భుతముగా వెల్లడియయినవి. లోకములోని సైన్యశక్తికిని నావికాశక్తికినిఁ బ్రధానమయిన దేశములలో జపానొకటి యని యప్పుడు నిశ్చయమయినది.

జపానుభటుఁ డట్టివాఁడగుటకు వానిగృహశిక్షయే కారణము. చిన్ననాఁటినుండి వారికి రెండువిధాయుకకృత్యములుగా నేర్పఁబడును. ఒకటి తల్లిదండ్రులకు విధేయత. రెండు దేశసేవ. ఈమారుమాటాడని విధేయత యొకస్వభావమయి భటులయినప్పుడు వారికత్యంతోపకారియగును. అతఁడు సైన్యములోఁ గలియకమునుపే శిక్షితుఁడగుచున్నాఁడు. అదివఱకుఁ దల్లిదండ్రులకును బెద్దలకు నాతఁడు జూపువిధేయత నిప్పుడు డధికారుల యెడలఁ గనఁబఱచును.

అతని రెండవవిధియైనదేశసేవకూడ సంపూర్ణభటత్వమునకు సహకారమగుచున్నది. అతఁడుదనప్రాణమును నిర్విచారముగా దేశముకొఱకును, చక్రవర్తికొఱకును సమర్పింప సిద్ధముగా నుండుటయేగాక దేశమునకై తనయావచ్ఛక్తిని బాటుపడి సేవచేయును. ఎంతయల్పపుపనినైన నాతఁడు చులకనగాఁ

జాడఁడు. అది తప్పినయెడలఁ బరీక్షకాలమున కేమిలోటు వచ్చునో యనిభయపడుచుండును. పెద్దఫిరంగి నడపుటలో నెంత జాగ్రతగా నుండునో చిన్నబొత్తమును దొడుగుటలోఁగూడ నంతజాగ్రతగా నుండును. ఇట్టిస్వల్పవిషయములయందుఁగూడ నింతటిమెలకువ గలిగియుండునభ్యాసమే జపాను రష్యాను జయించుట కొకసాధన మయినది.

యుద్ధసమయమున నుత్తరువునకు శంకయనునది లేదు. మున్నటియుద్ధమునఁ జాలమంది తమవారికిఁ ద్రోవయిచ్చుటకై తాముచచ్చుటకుఁ బోవుచున్నామని నిశ్చయముగా నెఱిఁగియుండియు వెనుకదీయలేదు. "బఙ్జై" యని కేకలు వేయుచు ముందుకుఁ బోయి శత్రువులయాయుధాగ్నియందుఁ బడి తమదేశమునకుఁ బ్రాణము లర్పించిరి.

---



## ఇ రు వ ది యొ క ట వ ప్ర క ర ణ ము.

### రెండు గొప్ప యుత్సవములు.

జపానీయులకు రెండుగొప్పపండుగలు గలవు. వానింగూర్చి యిదివఱకు మనము చెప్పుకొనియుండలేదు. అవి మిగుల ప్రధానమయినవి. అందొకటి సంవత్సరాది. రెండవది "బాన్ మత్సూరి" యను పెద్దలపండుగ. సంవత్సరాదిపండుగ వారికి మిక్కిలిగొప్పది. కొన్నిరోజు లెవ్వరు నేపనినిఁ జేయక హాయిగా దినములు గడపెదరు. ఈపండుగ శీతాకాలములో వచ్చినను ప్రతివీథియు వసంతకాలమునందువలెఁ బచ్చనితోరణములతోడను, పందిళ్లతోడను, రమణీయముగ నలంకరింపఁబడును. గుమ్మమునకు రెండువైపులను పచ్చనిచెట్లును వెదుళ్లును పాతుదురు. ఇవివృద్ధాప్యమును దెలుపును. వీథిపొడుగున నున్నవీనినన్నింటిని గలిపి పచ్చనిగడ్డిత్రాడుతోఁ దోరణము గట్టుదురు. ఈత్రాడు దయ్యమును లోపలకు రాకుండఁ గాపాడును. కనుక క్రొత్తసంవత్సరము సౌఖ్యముగా నుండును. వీథులమధ్య మధ్య జెండాలును, పచ్చనియాకులగలచెట్లకొమ్మలు నిలిపినవీథులు వనవాటికలవలెఁ గాన్పించును.

జపానీయులమర్యాద చెప్పతరముగానిది. వీథులలోఁ గలిసికొనినబిచ్చగాండ్రు గూడ నొకరికొకరు నమస్కరించుకొందు

రు. ఈమర్యాద యీపండుగరోజులలో ద్విగుణమగును. ఈ రోజులలోఁ జేయవలసినసమస్కారవిధి ప్రత్యేకముగ నుండును. పరిచయముగలయిద్దఱుగలిసికొనినప్పుడు నమస్కరణమును మఱవరాదు.

ఈదినములలో విశేషముగ విందులును బహుమానములును జరగును. జపానీయు లెల్లప్పుడు బహుమానముల నిచ్చుకొనుచుందురు. ప్రతితరగతివారికి వారివారితరగతిననుసరించి బహుమానము లేవియీయవలయునో యెట్లీయవలయునో వానికి విధులు గలవు. ఆమూటకుఁ గట్టఁబడినకాగితపురంగును త్రాడురంగును బట్టి బహుమానమును దెలిసికొనవచ్చును.

గొప్పవారును కొద్దివారునుగూడహాస్యమునకుఁ బ్రారంభింతురు. వారొకరినొకరు బిల్చుకొని యుత్సవములకుఁ బోవుదురు. మంచిమంచితీర్థములకుఁ బోయి వీక్షింతురు. విందులారగింతురు. ఎడతెగకుండ తేనీళ్లును ‘సాకే,’ యనుమద్యమును ద్రాగుదురు. బజారులురాత్రి మిగులనందముగాఁ గనిపించును. వీథులును దుకాణములవరుసలును నానావిధములయినరంగులుగలదీపములతో నలంకరింపఁబడును. దీపము లాఱంగుళములు మొదలు లాఱడుగులపొడుగువఱకు నుండును. చూడవచ్చినజను లందఱు మంచిమంచివస్త్రములను ధరించెదరు. జోళ్లచప్పుడును



ప్రతిదుకాణముమీఁదను వాయించెడుగంటలచప్పుడును రోదసి నిండును.

మధ్యమధ్య నూరేగింపుటుత్సవమునకుఁ దారియిచ్చుటకుఁ గుంపులువిడిపోవును. పెద్దరాక్షసితలకాయ భయంకరమయినరంగులతోఁ జేసి దానినొకఁడు ధరించి మనుష్యుఁడుగనపడకుండ బట్టలు గప్పికొని యొకఁడు నాట్యముచేయుచుండును. వారిముందు బూరా లూదుచు, డప్పులు వాయించుచుందురు. తరువాతఁ గొందఱుకూలీలు రథమునొకదానిని లాగుకొని వచ్చుచుందురు. ఆరథముమీఁదఁ గొందఱునాటకు లేదోపురాణగాథను నాటకముగాఁ బ్రదర్శించుచుందురు. దానితరువాత గొందఱుబాలురు హెచ్చరికతోఁ బూర్వపునృత్యమును సల్పుచుందురు. సంవత్సరాదినాఁడు సాయంకాలమునవిచిత్రమయిన సంత జరుగును. క్రొత్తసంవత్సరమురాకముందు పాతయప్పులన్నియుఁ దీర్చివేయుట జపానీయులయాచారము. అట్లుతీర్చని యెడల వానికింకఁ బరపతి యుండదు. కనుక యప్పుదీర్చుటకుఁ జేతఁ బైకములేనివారు తమవస్తువులలో నేవియయిన సంతకుఁ గొనిపోయి యమ్మి ఋణము దీర్చుకొనఁజూతురు. టోకియో పట్టణమునఁ బ్రతిప్రయాణికుఁడు నీసంతకుఁబోవును. రెండుమైళ్లదూరమున రెండువైపులను దుకాణములుండును. ఇవియన్ని

యు నూనెదీపములతో నలంకరింపఁబడును. ఈదుకాణములలోఁ బేదలగుజపానీయుల యిండ్లలో నెన్నిరకములవస్తువు లుండు నో యన్నియుఁ జూడవగును. ప్రతివాఁడును దనసరకులను గావడితో మోసితెచ్చికొంతస్థలము చూచుకొని యక్కడఁ దనసరకులను దుకాణము పెట్టును.

చాపలు, బొక్కెములు, బట్టలు, జోళ్లు, నగలు, పాత్రలు, వెండిగిన్నెలు, కంచుగిన్నెలు, మొదలగునవన్నియు నమ్మదెత్తురు. ఒక్కొక్కప్పుడు మిక్కిలియందమయినవస్తువులు వచ్చును. నగిషీచెక్కినవెండి, కంచుసామానులు, దంతపుపెట్టెలు, గుళ్లు గోపురములు, లోనగు పనినేర్పును వెల్లడించు, ననేకచిత్రమయినవస్తువు లాబజారునకు వచ్చును. సంవత్సరమున కానాఁటిరాత్రి యన్నియుబజారునకు వచ్చును.

పెద్దపండుగ వేసవికాలములో వచ్చును. అది యొక్కొక్కచోట నొక్కరీతిగా జరుగును. ప్రతిచోటను మంచివస్త్రములుధరించి వరుసలుదీర్చి యూరేగుదురు. వారు చేతులలో చిన్నకఱ్ఱలును, కేతనములును, లాంతరులును బట్టుకొని పాటలు పాడుచుందురు. పెద్దపెద్దపట్టణములలో నొక్కొక్కవిధముగా నా పండుగ జరుపఁబడును.



నాగసాకీపట్టణమున నాఁటికిందటిఏఁడు మృతినొందినవారిచైత్యము లన్నియుఁ మొదటినాఁడు దీపములతో వెలిగింపఁబడును. రెండవమూఁడవదినములలో నన్నిచైత్యములమీఁదను దీపములను బెట్టుదురు. అప్పుడు స్మశానవాటికయంతయు ననేకరంగులుగలదీపములతోఁ బ్రకాశించుచుండును. స్మశానవాటికకుఁ బోవుదారులన్నియు నంగిళ్లతో నిండి దీపములు వెలిఁగింపఁబడును. కొండలమీఁద మంటలు వేయుదురు. బాణాసరములను గాల్చుదురు. రుద్రభూమికడఁ జేరి విందు లారగించి మద్యపానము సేయుదురు. నాఁడు మృతినొందినపెద్దలయాత్మలన్నియు వచ్చుటనుండి తముతో విందారగించునని వారినమ్మిక. కడపటినాఁడు పెద్దలు ప్రయాణమయిపోవుటకొకవింతకేళిని సన్నాహము చేయుదురు.

"మూఁడవనాఁడు తెల్లవారగట్ల రెండుగంటలకాకస్మికముగాఁ దీపావళితో నొకపెద్దయూరేగింపుటుత్సవముతో కొండలమీఁదినుండి క్రిందికిదిగిసముద్రముకడకు వత్తురు. కొండలు మునుపటివలె నిర్మానుష్యము లయిపోవును. సంధ్యారాగము[illegible] మునుపు పితృదేవతలందఱు నోడనెక్కి పోవలెను. గనుక వారిసంతతివారు వారికిఁ జిన్నచిన్నగడ్డిపడవలు చేసి యందు గొన్ని[illegible]డ్లను, గొంతధనమును సమకూర్చి యుంచుదురు.

ఈపడవలో నదివఱకు రుద్రభూమిలో వెలిఁగించినలాంతరు లన్నియు నుంచఁబడును. గడ్డితో చాపలువిప్పఁబడును. అప్పుడు పడవలన్నియు గాలికెగిరిపోయి త్వరలోనే దీపములమూలమున నంటుకొనును. ఈప్రకారముపడవలన్నియుఁ బరశురామప్రీతి యైపోవును. పెద్దలుశీఘ్రగమనంబునఁ దమలోకములకుఁ బోవుదురు. కడపటిపడవ మునుగగనే కడపటిదీప మారిపోయి కడపటిపితృదేవత భూలోకమునుండి పోవును.

సమాప్తము.

———

